సుందరరామయ్య, అయినాపురపు

లాల్ గోహారు, అను, జయచంద్ర

చంద్రరేఖా విజయము

కాకినాడ, 1919

Record no. 488

Sundararāmayya, Ayināpurapu

Lāl gohāru, anu, Jayacandra
Candrarēkhā vijayamu

Kākināḍa, 1919

Record no. 488

## Bibliographic Record Target

సుందరరామయ్య, అయినాపురపు.

లాల్ గొహారు, అను, జయచంద్ర చంద్రరేఖా విజయము : పదియంకముల నాటకము / అయినాపురపు సుందర్రామయ్య గారిచే రచియింపంబడినది.- 3. కూర్పు.- కాకినాడ : నేలకంటి భావనారాయణరావు, 1919.

iv, 78 p. ;22 cm.

Record no. 488

Sundararāmayya, Ayināpurapu.

Lāl gohāru, anu, Jayacandra Candrarēkhā vijayamu : padiyaṅkamula nāṭakamu / Ayināpurapu Sundarrāmayya gāricē raciyimpambaḍinadi.- 3. kūrpu.- Kākināḍa : Nēlakaṇṭi Bhāvanārāyaṇarāvu, 1919.

iv, 78 p. ;22 cm.

Record no. 488

శ్రీరస్తు

# లాల్ గౌహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

పదియంకముల నాటకము.

ఇయ్యది


కొమరిపాలెం వాస్తవ్యులును

గూల్బకావలి, ముప్వజిరి, ప్రతిజ్ఞాపాండవము, ప్రతిజ్ఞాయాదవమాది

గ్రంధకర్తలగు

మ. రా. రా. అయినాపురపు సుందరరామయ్యగారిచే


రచియింపఁబడి


నేలకంటి భావనారాయణరావుచేతను,

కర్రి అచ్చయ్య అండ్ సన్సుచే

ప్రకటింపఁబడియె.

మూఁడువకూర్పు 1000.

కాకినాడ.

[illegible] కో., ముద్రాక్షరశాలయందు

1919

## ఈ నాటకమునందు వచ్చు పాత్రములు

### పురుషులు

ప్రభాకరుఁడు—రత్నగిరిరాజు.

జయచంద్రుఁడు—ప్రభాకరునికుమారుఁడు, కథానాయకుఁడు.

మతిమంతుఁడు—సత్యసేనుఁడు—ప్రభాకరుని మంత్రులు.

జనార్దనసింగు,— నారాయణసింగు—ప్రభాకరుని సేనాధిపతులు.

దుశ్శీలుఁడు—ప్రభాకరుని పినతండ్రి కుమారుఁడు.

దుశ్చేష్టుఁడు—,దుర్బుద్ధి—దుశ్శీలుని ప్రాణమిత్రులు.

సుశీలుఁడు—సుశీలులతోఁబుట్టువు,—వింగుళ్లకు రాజు.

శుక్రశర్మ—సుశీలుని మంత్రి.

నారాయణశాస్త్రి, వేంకటశాస్త్రి—ప్లీడర్లు

మానవవర్మ—వింగుళ్లనివాసి, క్షత్రియుఁడు.

దేవగుప్తుఁడు—మానవర్మయొక్క సాక్షి

### స్త్రీలు

సుశీల—ప్రభాకరుని భార్య.

చంద్రరేఖ—ప్రభాకరుని కూతురు, కథానాయకి

చిత్రరేఖ—మానవ వర్మ భార్య.

కమల—మానవ వర్మయొక్క ప్రథమభార్యకుమా[illegible]

రేవతి—చిత్రరేఖకుమార్తె.

సుందరి, రోహిణి, శ్యామల, మణిమాల—కమల రేవతుల యొక్క నర్మ[illegible]
[మణులు

చంద్రమణి—సుశీల దాసిగా యుండినపుడు పెట్టుకొన్న పేరు.

☞ ఇంకను కథాసందర్భానుసారముగ జాలరివాండ్రు బోయిలు పాలెకొండలు స్త్రీలు యుద్ధవీరులు ప్రవేశింతురు.



# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## నాంది.

ఉ. కేలధ్వనింపఁగాచతతి ♦ గిల్కనిమ్రోవఁగ గంతహారముల్
బాళినటింపఁజన్మ్రనల ♦ వైసరిదండలకుచ్చులేర! యూ
గాడనితంబముల్ కవును ♦ కవ్వముచేదధిజిల్కుచుండ ముం
గాలనుబట్టి "స్తన్యమొసఁ ♦ గమ్మరో!" యంచును గారమాడుగో
పాలుఁడుభక్తపాలుఁడు కృ ♦ పామతిసభ్యుల కిచ్చుకోరికల్. 1

(నాంద్యనంతరమున సూత్రధారుఁడాకసము వంకఁజూచి)

సూత్ర—ఆహా! నేటికి నాజన్మసార్థకమయ్యెఁగదా. ఆశాభూజము ఫలించినది. సమస్త విద్యాచాతురీధురీణులగు నీసభాసదుల యనుజ్ఞపడసి నాటకమాడఁ గడంగెదను. ఏకార్యమునకైన నొకరికొకరు తోడుండిన ననాయాసముగా నెఱవేఱునని యార్యు లుపల్కుచుందురు. కావున నాప్రేయసినిఁ బిలిచెద. (అని తెఱవైపుఁజూచి) ప్రేయసీ! అలంకరించుకున్న పక్షమున నిటురమ్ము.

నటి—(తెఱలో) ఇదిగో వచ్చుచున్నాను. (ప్రవేశించి నమస్కరించును.)

సూత్ర—కల్యాణంభవతు.

నటి—నాథా! నన్నిసభకుఁ బిల్చుకారణమేమి?

సూత్ర—[illegible]! నేటిదినంబున వృత్తవైచిత్ర్యముగలిగి కరుణరసము[illegible]గొల్పెడు నాటకము [illegible]ప్రదర్శింపఁబడునని విని దానినిసన్మానింప సభ్యులు విచ్చేసియున్నవారు. [illegible]నేర్ప నాకు సహాయురాలు వగుదువని రావించితి.

[illegible]! ఇచ్చటనెద్ది ప్రదర్శించెదరు?

[illegible]! నీవెఱుంగవా? యెఱుంగకున్నఁ జెప్పెద వినుము.

[illegible]ప్రతిదినం ♦ జయనాపురాన్వయుం, డలరు భరద్వాజ ♦ కులభవుండు
సార్థసన్నుతుండు ♦ సమ్మతసంభాషుండు, సుక్షితిదివరాజు ♦ సోమరాజు

నమ్మహాంపిప్రియా రాణీ ♦ యరవిందమృదుపాణి, సుగుణమణికదంబ ♦ సుందరాంబ
వీరలకో మరుండు ♦ విభుధవిధేయుండు, సైనసుందరరామ ♦ యాఖ్యసుకవి
భువనలం జెందిన భారతి ♦ కథలయందు లాలుగోహరనం బరగు ♦ జాలి కతను
గడంగిజయచంద్రచంద్రరే ♦ ఖావిజయమనంగరచియించె నాటకం ♦ బాంధ్రమునను.

షష్ఠీవృత్తము. ఆడుదమిఃపుడుక్, బాడుద తెంతో
వేడుకగోరన్, నేఁడుజనంబుల్. 3

నటి—ప్రియా! ఈకవి యందఱిని మించినవాఁడయినాఁడే!

సూత్ర—ఏమటులఁ బల్కుమంటివి?

నటి—ఉ. కొందరు భారతాదులను ♦ కూర్మిదలిర్పఁగ నొప్పుగాథలన్
కొందరు హూణభాషఁగల ♦ గొప్పకథల్ తమివ్రాయుచుండ వీ
రందరికన్న మించి మన ♦ మందఁగఁ భారతిభాషసత్కథల్
పొందుగ నాంధ్రమందు బుధ ♦ పుంగవులెన్నఁగవ్రాయవింతయా. 4

సూత్ర—ఔనౌను, నీవు చెప్పినది నిజమే.

నటి—ఆర్యా! నాకింకొక్క సందియము పొడముచున్నయది.

సూత్ర—అదియెద్ది?

నటి—ఉ. బాలుఁడునిర్వదేండ్లగల ♦ ప్రాయమువాఁడు సతంబుసత్యసం
ధీలుఁడు నార్యసత్ముఁడు వి ♦ శేషయశోవిభవుండు వేణుగో
పాలకృపన్ గవిత్వపరి ♦ పాటి జెలంగెడువాఁడు నాతఁడే
లీలగ మెచ్చుకొల్పు నవ ♦ లీల రచింపఁగ గల్గెదీనినిన్. 5

సూత్ర—ఓసీ! వెఱ్ఱిబానా? ఇదియా యింత సెద్దియోయని యాలోచించుచుంటిని.
కాసందియమేల? వినుము.

ఆ. వె. ఎంచ దీపకళిక ♦ యించుకయ్యైనను
నీకాంతి యిల్లునిండ ♦ కరిమ్మభంగి
కవియు బాలుఁడైన ♦ గవితచాతురివోనె
యిందుకేల నీకు ♦ సందియంబు.

నటి—సఖా! నా సందేహము తీఱినది. సెలవు తీసికొని తగిన పాత్రములను సమకూర్చెదను.

సూత్ర—చెలీ! మంచిది. మనము ప్రదర్శింపఁబోవు నాటకమునకు ముందు [illegible]
ణకావసేయుము.

నటి—దేవా! ఏ ఋతువు వర్ణించను?

సూత్ర—ఎల్లసుఖములనిచ్చు వసంతఋతువును వర్ణింపుము.



నటి—చిత్తము. లయగ్రాహి.

కాంత లనిశంబునిజ ♦ కాంతులనుగోరిసమి
వింతయునుసౌరభల ♦ తాంతవనకేళీ
స్వాంతు లగుచుండ నిరు ♦ పాంతనికుంజపుంజ
సంతతులుగీరముల ♦ సంతసముగఁ గూయన్
దంతశకదంతరద ♦ జంతుఘనదంతిక్ర[illegible]
పంతిముఖభూజములు ♦ సాంతముగఁ బూయన్
వృంతములు గల్గిన ల ♦ తాంతములుతీవెలువ
సంతసికిఁ జేరులుగ ♦ వింత చెలువొప్పన్. 7

సూత్ర—ఆహా! కల్యాణీ! త్వదీయగాన మాధుర్యము మనంబునకుల్లాసముగా నున్న
యది. అదియునుంగాక,

తే. గీ. సఖియనీ గానషడ్జమ ♦ స్వరము విని [illegible]
తలఁకి దర్వీకరంబులు ♦ తలలువంచి
ప్రాణరక్షణకొరకునై ♦ పరుగు లిడుచు
సెలవుగగనలేక పుట్టలో ♦ నిలచియుండె. 8

నటి—నాథా! నన్నీసభామధ్యమందిట్లు నిరసనచేయుట భావ్యమేనా?

సూత్ర—ప్రేయసీ? నీవెటులఁ దలంచితివి.

నటి—ఆర్యా! "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ" అని శాస్త్రమేకదా. ఇప్పు
డు నా సంగీతనైపుణ్యమునకుఁ బాములు తలలువంచి పుట్టలలోఁ జొచ్చెనని సెలవి
చ్చుటఁ జూడఁగా, (———)

సూత్ర—ఓసి వెఱ్ఱిదానా! "షడ్జమ్ మయూరోవదతి" అని సంగీతశాస్త్రము తెల్పు
చున్నయది. అనఁగా షడ్జము స్వరము నెమలికూతవలెయుండును. మయూరములకు
[illegible] వినఁగానే ప్రాణభయము కలుగునేమో
[illegible]ంటి.

నటి—నాథా! కేకియందు సౌందర్యమున్నదిగాని [illegible] సొంపుగా
నుండునా?

సూత్ర—నవ్వులాటలకుఁ బరిహసించితిని.

నటి—ప్రాణేశా! నేటిదినమున రత్నదేశ నివాసు లత్యంత కుతూహలమగ్నమానసులై
యుండుటకుఁ గారణమేమి?

సూత్ర—ప్రేయసీ! తే. గీ. ప్రజలసేమంబరయగా ♦ ప్రభాకరుండు
తనదుప్రియపుత్రితోరాగ ♦ తనయుతోడ
మంత్రియుగ్మంబుభటులుసా ♦ మంతులాది
కొలువఁగొలువలోనికిఁజన ♦ దలఁచిరబల 9

నటి—ప్రియా! అయ్యది రాజులకు ధర్మమే. అందులకయి యీప్రజలకింత యానందమేల.

సూత్ర—ఓసీ! వారిదుర్దశ ప్రభునితో మనవిఁ జేసుకొన్న దానికిఁ దగిన సదుపాయముఁజేయుదురు. ఇదిగాక యీనృపుని పితృవ్య పుత్రుండగు దుష్టులని దుర్వర్తనంబులుఁ జెప్పి శిక్షవిధింప వేఁడుకొందురు. దానివలన యీనివాసులు మిక్కిలి సుఖముగా నుండెదరు.

నటి—సఖా! అటులైనచో మనమిచట నిలుచుట కర్జంబుకాదు పోదము రండు.

సూత్ర—మంచిది.

(అని యిర్వురు నిష్క్రమించుచున్నారు.)

ప్రస్తావన ముగిసినది



యీపై ప్రస్తావన కొంకుదురు గ్రామవాసీయుఁడును, అయివాపురపు సుందరరామయ్యగారి ప్రియస్నేహితుఁడును, ఆయిన నబ్బెళ్ళ రామిరెడ్డి వలన వ్రాయబడినది.



# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## ప్రథమాంకము

[ప్రభాకరుని కొల్వు.]

(ప్రభాకరుఁడు తన కుమారుఁడగు జయచంద్రుని, కుమార్తెయగు చంద్రరేఖను, నిరుప్రక్కల నిడుకొని మంత్రి సామంతాది జనంబులను, భటులును, గొల్చుచుండ, మంత్రులను జూచి)

ప్రభా—సచివాగ్రణులారా? మనపురజనులందఱును,

సంసారములతోడి ♦ సంపదలనుగూడి, సుఖముగావర్ధిల్లుచుండిరిగద
వంశానురాగులై ♦ వర్ణాశ్రమవిధుల, నందజపాయుగొల్చు ♦ చుండిరిగద
[illegible] ధర్మపరత ♦ నుండిరిగద
జారచోరదురాప ♦ చారము [illegible] ండి ♦ యుండిరిగద

మంత్రి—గీ. దైవమనుకూలుఁడైమన ♦ దతినిఁజేరనరులుమన రాజ్యమం [illegible] టు
సర్వశక్తుల ప్రభువరు ♦ లుర్వి నేల మహికిఁగొదవేలఁ గల్గునో ♦ మా [illegible]

సత్య—రత్నగిరీంద్రా! తమతోనెద్దియో మనవిఁ జేసుకొనుటకు పురజనులు వచ్చేసి యున్నవారు.

[ఒక వైపునుండి ప్రజలుప్రవేశించుచు.]

హిందూస్తానిరాగం.

భూపతియీపురమందున । కాపురమేపారగ వీడెగెదమో।
కాపాడావే । పాపము మే మాగగ లేమి కర్మియన్నన్నా॥ భూప॥
దేవర యేమని వణికాంపము । మీయనుజుఁడు పెట్టెడుబాధలను।
మత్సరమో । యుత్సవమో । దైవమెంతెంగెదు నయ్యయ్యో॥ భూప॥
అతనిదుష్కృత । కృత్యములెంచుట । మాతరమగు వనితలఁచవు।
భూతలనా । ధాతనిపని । ధాతయెంతెంగెదు నా హాహా భూప॥
ఈక్షణమాతని । పక్షముమానిక । శిక్షోనరించిట।
రక్షించవిలే । కక్షయమెత్తగు । కక్షులకేగెద మకటకటా॥ భూప॥

మొద—ఆర్యా! కం. కలిమినిబలిమిని నీకీ
బలుమీసములేలయుంచు ♦ బట్టికటారీయు
య్యేలులూగఁగ వ్యధకోర్వన్
నిలుపోపక నెట్టఁగినిసి ♦ నిర్దయమోదున్ 3

ప్రభా—ఆహా! యెంతదుర్మార్గత.
మది—అతఁడుచేయు దుష్కార్యములలో నిదియొకకార్యమా?
రెండ—మానవేశా! మేము తమ దర్శనమునకు వచ్చుచుండ దారిలో.
క. జవరాలొక్క తెగనితా, జవమున నెదురేగినిల్చి ♦ చానా! నవలా!
నవులాటగాదు నాతోఁ, గవయుమని జవిరి పరుగిడెఁ ♦ గతి నాత్మంకై. 4
ప్రభా—హరిహరీ [అని చెవులు మూసుకొనుచున్నాఁడు.]
మూడు—రాజశేఖరా! నిన్నసాయంకాలమున యాదుష్టుఁడు.
మత్తకోకిల. కన్నుఁగానక మేనెఱుంగక ♦ గట్టుపుట్టములూడఁగా
మెల్లమెల్లనదూలుచుంబడి ♦ మెల్లమెల్లగ లేచియుం
దల్లనల్లన పోవుపాంథుల ♦ నడ్డగించుచు [illegible]
కల్లుచేగద యీమహత్తము [illegible] భూపాల.
ప్రభా—అన్నన్నా! [illegible]
నాల్గు—[illegible] నాలు దినాలక్రిందట కొందఱుమందయానలు
[illegible] మందగమనంబుల నొంటరిఁ బోవుచునందందమారొక కుం
దరదనముందు కేగి, మరునందరికి తాళఁజాలనని చిటికెలు వైచుచు.
తర. ఇనివరకీభుని * సెందరిగారకునును, నిందునిభాస్యల * నీటునగి



మొదితనుబోరిన * మోహాసరూపము, ముద్దులగుమ్మను * మున్నెపుడున్
గదియఁగలేదని * కాగిటచేర్చి వి, కారికనవ్వుచు * కాంతను తా
నదిమినవెన్కటె * యచ్చముఖు ల్భయ, మందిరియద్భుత * మయ్యెన్నృపా. 6
ప్రభా—ఆహా! యెంత క్రూరకృత్యము.
అయి—రాజా! బ్రాందిసీసాను కేలంబట్టుకొని తెఱువున కడ్డముగానిలువఁ
బడి నాట్యముఁ జేయుచు,
భువ. సుం. చక్కపగడది ♦ సతియటన్నను ♦ జచ్చునీదగుకాయనే
డొక్కదచ్చెని ♦ యక్కడంచెద ♦ యొక్కనిమిషములోనల
డ్డక్కజూడమి ♦ జేతీవంచ ♦ యెంచుమటంచుతనకున్
బక్కనేగుదు ♦ వారలం గని ♦ బట్టివెంటను తఱుమునో. 7
ప్రభా—ఇసీ! యెంతదుర్మార్గము.
ఆర—భూపతులావతంసా! మార్గమున కొకప్రక్కగాఁ గూర్చుండి యిటునటుఁబో
వుప్రయాణికులం బిల్వ నారంభించినవారలు.
చ. పిలచినఁబల్కనేను నిను ♦ బిల్వగలేదను పట్టికొట్టఁగా
జలుకక యూరకుండునెడ ♦ బల్కవుపిల్చిన గర్వమానరే
నిలు వెటుబోదుపంచఁబడ ♦ నిట్టిశిరంబున మోదుగజ్జుచే
ప్ర—చిలిపితనంబుఁజూడఁగ వి ♦ చిత్రము గాదొకొ యెట్టివారికిన్. 8
ఏడవ—అధిపా! ''పిల్లికిఁ జెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము'' అనురీతి దమబో
ధకులకు విచిత్రముగాని, మాయట్టి యల్పులకు దర్శ్యనాశనమేకాకుండ మాన
ప్రాణభీతిగా నున్నయది. ఎట్లనిన సిగ్గవిడనాడి చెప్పెద.
సీ. ఆరామమందున ♦ నారామతోఁగూడ, నిదురింప నడురేయి ♦ నదియెఱింగి
ప్రాకారకుడ్యంబు ♦ నేకాంతముగ దాఁటి, పర్యంకశయనయౌ ♦ పంకజాక్షి
పైబడనుంకిప ♦ భామయు బెగడొంది, దిగ్గన మేల్కాంచి ♦ సిగ్గువిడిచి
కన్నులెఱ్ఱగఁజేసి ♦ మిన్నెగికేటట్లు, కూఁకలువేయంగ ♦ గుం[illegible]
తే. గీ. లేచునంతఁదొంగప్రభు ♦ నాఁచుకొనగ
గినిసిపైబడఁ బానతా ♦ దనమొనర్చెఁ
తో[illegible]ప్రాణావశిష్టుఁగఁ ♦ జేసిపారె
ప్రభా—కట్టయిటువంటిహానిపైఁ ♦ గరుణయేల.
ఎని—ఓనరపతీ! మనుజుల సంగతి యటుండఁగా నోరెఱుంగని చతుష్పాజ్జంతువుల
[illegible]

చ. ఖరమొకదానిఁబట్టుకొని ♦ కాళ్ళకుఁ దోకకుయాకులన్
సరగునఁగట్టినిప్పునిడఁ ♦ జయ్యన మంటలు గ్రమ్మ మేనుపైఁ
బురబురఁ బొక్కులెత్త వ్యథఁ ♦ బొందఁగఁ జాలక పారిపోవఁగాఁ
గరములు తట్టుచున్న గను ♦

ప్రిథా—　　　　　　　　కట్టడికార్యములెట్లు చేనగున్. 　　10

సౌమిత్రి—ఓమర్త్యాధిపా! జంతువులసంగతి యటుండఁగా నెంతకతినాత్ములకైనను బిడ్డ లనినవో నుల్లము కఱుఁగక మానదుకదా! అట్టిపసికూనలు.

ఉ. బారులుగట్టిపాటలను ♦ బాడుచు నాడుచు నుత్సుకంబుతోఁ
దీరుగఁ బోవువారిగని ♦ తీవ్రము గాఁదరిఁజేరఁజేరి ని
ష్కారణమైన నేరమును ♦ గల్పనజేసి యకారణంబుగా
గారడిబుద్ధిపోదు
　　　　గని ♦ కారమఁ జెందని జన్మమేలకో 　　11

వది—ఓ రాజశేఖరా! వేయేలా, యాదుష్టులుని శిక్షింపకుండిన

తే. గీ. కాపురంబులు విడనాడి ♦ కాన కేగి
పత్రఫలములు తినినైన ♦ బ్రతుకవచ్చు
నెంత సిరియున్న నీలాటి ♦ యింతలకట
యనుభవింపగ శక్యమే ♦ యజునికైన. 　　12

ప్రిథా—[మింటివైపు జూచుచున్నాఁడు]

ఒకస్త్రీ—రాజా! “రక్షింపురక్షింపు” (అని రాజుముందు నిలుచును.)

[రాజా శ్చర్యము నభినయించుచున్నాఁడు]

[మనుష్యసంఘము నివ్వెరపాటితో నొకప్రక్కను నిలువఁబడియుండెను.)

దుష్టి. (తెఱలో) మత్త. “బాలరో యిక పారిపోతిని ♦ బాగుబాగని” యెంచకే
వీలుగానని యూరకుంటిని భీతిచేతను గాదె భూ
పాలుఁడుండిన నాకులత్యామె ♦ బట్టకుండిన నెల్లిదు
ప్పలుఁడంచును బిల్వబోకుము చేడెరో! యిదియెట్టుగా
[అని వెనుకకు బోవుచున్నాఁడు.]

స్త్రీ—[విచారముతో] దేవా! మీపినతండ్రి పుత్రుఁడొనరించు దుష్కృత్యములఁజూచి యూరకుండుట తమబోటి సాధు సజ్జనులకు ధర్మమా? యాయట్టి పతివ్రతల కర్మమా?

ప్రిథా—ఆహా! ఏమి యీనిదౌర్జన్యము!



మతి—నృపశిఖామణీ! వీరిమాటలు పాటిసేయక యూరకున్నను, నిప్పుడు నిదర్శనముగాఁ జూచితిరిగదా.

ప్రిథా—సచివాగ్రణీ! యాతనిసంగతి యిదివఱకే యెఱుంగుదుము

సత్య—(రాజునుద్దేశించి)

ఉ. భూపకులాగ్రగణ్యా! గన ♦ భూజనపుణ్య పరాక్రమవిక్రమా
టోపభుజాభలాఢ్య నుగు ♦ ణోజ్వల సుందరమూర్తీ! యొల్లడన్
మీపినతండ్రి యాత్మజుఁడు ♦ మేదినిపై నొనరించు దుష్కృతుల్
శ్రీపతికైన లెక్కఁగొన ♦ జెల్లునె! సర్వము నిండియుండినన్.

వేయియనసేల? జారచోరగుణంబులం దాటితేటి వేట పాన జూదంబులకు మేటియై మన్నుమిన్ను గానక వర్తించుచున్నవాఁడు. కావున యుపేక్షంజేసి శిక్షయొనరింపకున్న, నాతని దౌర్జన్యమును మనము వృద్ధిఁబొందించినవారమగుదుము. అదియునుంగాక మన కాతనివలన ముందెద్దియైనను గీడు మూడక మానదు.

ప్రిథా—(కుమారునివంకఁ దిలకించి) కుమారా! యిదివఱలో మనదుష్టులని చెడునడతలను సహించి యూరకుంటినిగాని, యంతకంతకు వానిదుర్జనత్వము హెచ్చుచున్నయది.

ఉ. ఈతని జంపనామదికి ♦ నెంతయు నిష్టములేదుగాని యీ
రీతినియూరకుండునెడ ♦ శ్రేయము గాదు ప్రజాళికెంతయున్
భీతియొకింతలేక గడు ♦ బేరిజవృత్తిఁ జరించుచుండు నీ
పాతకి జంపినంగలదె ♦ పాపము నేఁడు కుమారశేఖరా. 　　15

అయినను యుష్మదభిప్రాయంబు నెఱింగి మెలంగువాఁడ. దీనికర్తవ్యంబెద్దియో యాలోచింపుము.

జయ—పెద్దలు తమరును, మంత్రులు నుండఁగా నాసమాత్రము తెలియునా? అయినను, తే. గీ. సంకెలలువేసి మన చెర ♦ సాలయందు
నుంచి మతిబుద్ధిరా విడిపించవచ్చు
గాని యిట్టిదుర్వాదులు ♦ కరముమినుట
ధర్మమనుచును దలఁపనో ♦ తండ్రి నేను.

ప్రిథా—బాలకా! నీవు చెప్పినది బాగుగానున్నది. (అని భటులనుద్దేశించి) ఓరీభటులారా! తే. గీ. ఎల్లి యాతనికడకు మీ ♦ రెల్లఁబోయి
బట్టి సంకెలలునుపైచి ♦ కొట్టులోన
బెట్టియావల సభకును ♦ బేగిరముగ
రండు లేకున్న మిమ్ముల ♦ గండడంతు. 　　17

భటులు—చిత్తము స్వామీ. (అనిపోవుచున్నాడు.)

వరిభా—(వరిజలవైపుఁజూచి) అతని రేపటిదివసమున గారా గృహబద్ధునిగాఁ జేయుచున్నాము. మీమీ నివాసములకుం బొండు.

వరిజలు—చిత్తము మహారాజా! తమబిడ్డలను మమ్ము నేలాగు రక్షించెదరో!

(అని సంతోషముతోఁ బోవుచున్నారు.)

(స్త్రీయును వారి వెంబడి నిష్క్రమించు చున్నది)

వరిభా—మంత్రిపుంగవా! యింక నేమైనా తగవులు కలవా?

(అంత నొకభటుఁడు ప్రవేశించి)

భటు—మహారాజా! తే. గీ. భామలిద్దరుగాంచంగ ♦ బాలునొకని
వెంటబెట్టుక యీసభా ♦ మంటపమున
కావలిద్వారమందు మీ ♦ యాజ్ఞకొఱకు
నిలచియున్నార లాజ్ఞయే ♦ కొలువుఁజేర.

వరిభా—ఓరీ! త్వరితముగా నిటుఁదోడ్కొనిరమ్ము.

భటు—చిత్తము. (అనిపోయి యిరువురుస్త్రీలతోను అయిదు సం॥ ల వయస్సుగలబాలునితోను బ్రవేశించుచున్నాడు. పిల్లవానిని మధ్యనిలిపి స్త్రీలిద్దఱు చెరియొకవక్క నిలువఁబడినారు.)

వరిభా—ఇదియేమిటి?

మొ-స్త్రీ—దేవా! యీతడు నాకుమారుఁడు.

రెం-స్త్రీ—రాజా! యీతఁడు నాపుత్రుఁడు.

వరిభా—ఆపిల్లవానిని మీరిద్దరు నొక్కసారిఁగఁ బిల్వుఁడు చూతము.

మొ-స్త్రీ—కంజ్జీవృత్తము. చిన్నికుమారా ♦ యెన్నడినిత్తున్
వెన్నయుబాలున్ ♦ దిన్నగరమ్మా. 19

(అనిపిల్వఁగానే యీమెయొద్దకుఁ బోవుచున్నాఁడు.)

రెం-స్త్రీ—నురలతెవృత్తము. మురుగులుగొల్సల్ ♦ యరయఁగనీకున్
సరగుననిత్తున్ ♦ పరగునరమ్మా. 20

[ఆమె వద్దనుంచి యీమెవద్దకువచ్చి తిరుగ మధ్యను నిలుచున్నాడు.]

వరిభా—(ఇంచుక నేపాలోచించి( వత్సా! నీబుద్ధికుశలతఁ జూడవలెననియున్నది కావున నీతగవుఁ దీర్పుము.

జయ—చిత్తము. (అని భటునిదెసఁజూచి)



విభూతి. నిల్వకుండపొమ్మికన్ ♦ పల్వురుండఁగానభన్
పిల్వుమొక్కసూనకిన్ ♦ కొల్వులోనికిప్పుడే. 21

భటు—చిత్తము. (అని నిష్క్రమించి తలారితోఁ దిరుగఁ బ్రవేశించును)

తలా—నమస్కారముస్వామీ! ఏమిశెలవు?

జయ-రుగ్మ. ఓరీతలారీ ♦ యొయ్యనబాలున్, చేరి కరారిన్! ♦ జీల్చుమువేగన్
సొరదలిర్పన్ ♦ సభ్యులుమెచ్చన్, వారికొసంగన్ ♦ వాదముతీరున్

చంద్రి—అన్నా! ఏల? నిష్కారణముగా బాలునిఁజీల్చ నానతిచ్చెదవు?

జయ—అమ్మా! నీకు తెలియ దూరకొమ్ము.

తలా—చిత్తము దేవా! (అని నఱకఁబోవుచున్నాఁడు)

మొ-స్త్రీ—అ, అ, అ.

[అనితలారియొక్క ఖడ్గమునుబట్టుకొని జయచంద్రునితో విచారముగా]

ఉ. బాలుని జంపఁజేయి యెటుఁ ♦ బాల్పడు నక్కట నాకునిప్పుడీ
బాలునిలోన నిల్లు సగ ♦ పాలు నొసంగఁగవద్దు దానికీ
మేలగు నిచ్చినం బ్రీతికి ♦ మేదినిపై తిరుగాడుచున్నచోఁ
జాలమనంబునం దెపుడు ♦ సంతస మొందుదు రాజశేఖరా. 23

జయ—[ఆలాగు వచించు మొదటిస్త్రీనిఁజూచిసంతోషముతో]

మృగీవృ. బాలనో ♦ మేలుగా, బాళితో ♦ బాలునిన్. 24
ఇచ్చితిన్ ♦ మెచ్చితిన్, జెచ్చెరన్ ♦ బుచ్చుకో. 25

మొ-స్త్రీ—మహాప్రసాదము. (అని బాలునియెత్తుకొనుచున్నది)

జయ—[రెండవస్త్రీవైపుఁజూచి కోపముతో] ఓభటులార!

తే. గీ. సంకెలలువేసిదీని ని ♦ శ్శంకలేక
యుంచుడీ చెఱసాలయం ♦ దించుకయును
జంకులేకను మాయొద్ద ♦ బొంకులాడ
నెంతకైనను నెఱజాణ ♦ వింతినీవు. 26

భటు—చిత్తము. (అని యీమెను దీసికొనిపోవుచున్నారు.)

మొ-స్త్రీ—రాజా! నాకుఁ బుత్రదానముఁజేసినారు. మీకు బెక్కువందనములు, సెలవొసంగితిరేని పోయెద

వరిభా—మంచిది.

(స్త్రీ నిష్క్రమించుచున్నది)

చంద్ర—నాన్నగారు! సాయంసంధ్యా సమయము కావచ్చినది సెలవొసంగితిరేని యు
ద్యానవనమునకు కేళీవిహారార్థమైబోవ నుద్యుక్తురాలనైయున్నాను.

ప్రభా—(ఆమెను ముద్దుపెట్టుకొని) అమాత్యరత్నములారా! నేటిదినము తగవుల తీ
ర్పుతోనే కాలయాపన మైనది. రేపటిదినము దేశక్షేమ మరయుదము. మనము
కూడ నుద్యానవన విహారార్థమై పోదమురండు.

మంత్రిలు—మంచిది.

(అని నిష్క్రమించుచున్నారు.)

తే. గీ. ధాత్రినయినాపురవు వంశ ♦ ధార్మికులగు
సోమసుందరాంబల ♦ ప్రియతనూజుఁడై
యలఘుసుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## ద్వితీయాంకము

### ప్రథమరంగము.

[రత్నగిరిపురము వెలుపలబయలు, సారాపాకనుండి దుశ్శీలుఁడు, దుర్బుద్ధి సారాసీసా
నొకచేతి నుంచుకొని ప్రవేశించుచున్నారు.]

దుశ్శీ—(సారాసీసాను చేతిలోఁ బెట్టుకొని)

సీ. ఇయ్యదియేకదా ♦ నెయ్యముత్క్షణములో నొనగూర్చుటకుమంచి ♦ యనుఁగుమందు
ఇయ్యదియేకదా ♦ కయ్యామం దటువంటి, శూరుల నెదిరింప ♦ ధీరుబంటు
ఇయ్యదియేకదా ♦ యొయ్యొడనైనను, జారచోరతకును ♦ జూరిమి చెలి
ఇయ్యదియేకదా ♦ చయ్యనమోక్షంబు,పొసఁగఁజేయుటకున ♦ ముక్తిపథము
బుద్ధి తొలఁగని జన్మంబు ♦ గడ్డిపరక తోటిదైనను సరిగాదు ♦ తులువలకట
దీని నిందింపనెంతురు ♦ మానసమున నట్టివారల కుండునే ♦ పుట్టగతులు.

[అని తిరుగ త్రావుచున్నాఁడు.]

దుర్బు—అన్నా! దుశ్శీలా!

పంచ. ఆశ్రేయ రేయి కే యిదేటి ♦ యద్భుతంబు త్రావిందిరా
పరాక్రమహీనుకైనగాని ♦ పౌరుషంబు గొల్పురా
శరీర రోగమెల్లఁద్రోచి ♦ సౌఖ్యమిచ్చి బ్రోచురా
ధరన్ననంగ దీనితో స ♦ ధర్మ మేది యౌనురా.

దుశ్శీ—(మఱియొకసారి పుచ్చుకొని తేన్పుతో) పవ్వా! యేమా? యీరుచి! ఏమి
యా కైపు! ఏమిదీనితమాషా! ఏమీయీవింత!

(ఇద్దరును యొడ్డితెడ్డముగా నాట్యముఁజేయుచు)

శ్యామారాగం, ఆదితాళం.

దుర్బు— ఏమని సెప్పాదు ♦ యేమని సెప్పాదు
ఏమని సెప్పాదు ♦ యీబ్రాంది మహిమ నిక
కామంధకారులకు ♦ బ్రేమనోనగూర్చునార॥ ఏమని॥

దుశ్శీ— ఇల్లైనగాని మఱి ♦ యిల్లాలినైనఁ గాని
మళ్ళైనగాని క్రియ ♦ మందఁజేసి త్రాగవలె॥ ఏమని॥

దుర్బు— కుత్తుకల్వీడిన ♦ నెత్తూరుల్ కారిన
చిత్తమొకించుక ♦ జెదరనీయనిబంటు॥ ఏమని॥

దుశ్శీ— క్షీరముల్ కానిమ్ము ♦ చెరకుసారమేకానిమ్ము
పేరైన యీచిగురు ♦ సారాయికిసరియౌనె॥ ఏమని॥

దుర్బు— ఉద్యోగాలుండిన ♦ యూశ్యైలుచుండిన
సద్విద్యలెన్నున్న ♦ వెలయునె? యిది లేకున్న॥ ఏమని॥

దుశ్శీ— కవికైనగాని ♦ యా రవికైనగాని రఘు
ధవునికైనగాని ♦ తరమా నెవర్ణింప. ఏమని॥

[అని యొకరిపైనొకరు పడుచున్నారు.]

దుర్బు— (స్మారగణముఁదెలిసి కోపముతో)

ఉత్సాహసుగంధి.

త్రాగుపోతత్రాగుపోత ♦ తప్పద్రాగుటన్ కడున్
జోగులాడ గచ్చులాడ ♦ జుట్టువీడగా వడిన్
సేగిసేయనెంచినావొ ♦ ఛీయికన్నినున్విడన్
వీఁగడంతుబోరపోర ♦ (అనితన్నుచు) విక్కులెల్లవీడుమీ. 4

దుశ్శీ—(లేచి కోపముతో) త్రాగుపోతు గాడిదకొడకా! నేనేనా గాజులువైచుకొన్నవాఁడను (అనిమీఁపయిఁబడి పాదతాడనముఁ జేయుచు)

క్షమానిని.। ఛీదురాత్మనీవఘరన్, నాదు కత్తివేఁటునకీ
మీఁదఁ గతఁ పోదువొకో, వాదమేల వీడితికన్ 5

దుర్బు—(కన్నీరునింపుచు) అదిగో మనయన్నయగు దుశ్చేష్టుండిటు వచ్చుచున్నవాఁడు. ఆతనితో మనపోట్లాటకు, గారణముఁజెప్పుదము. మన నేరము బాగుగా విమర్శింపఁగలఁడు.

దుశ్శీ—మంచిది.



దుశ్చే—(భంగుబుడ్డినిచేతఁబట్టుకొని పాడుచు ప్రవేశించుచున్నాఁడు.)

పికనాదము. భంగుద్రాగకయున్న ♦ వానికి జన్మమేలకో
యంగనామణిగూడి ♦ యాడనిప్రాయమేలకో
సంగడీంద్రినుతోడ ♦ సౌఖ్యవిహారమైయొకో
టింగురంగయటంచు ♦ కీవిగబోక నేలకో. 6

(ద్రుశ్శీల దుర్బుద్ధులు వానింగౌగలించు కొనుచున్నారు.)

దుర్బు—అన్నా! కూర్చుండుము.

దుశ్శీ—అన్నాయేది ఆభంగుబుడ్డి (అనిచేతంబట్టికొని) వహ్వా! యేమి?

తరంగిణి. కలంజిభంగువిస్కి ♦ కల్లుబ్రాందు లాదిగా
గలట్టిమత్తునిచ్చు ♦ కార్యద్రవ్యసంతతి
న్విలాసినీలచెల్మి ♦ వీటినిన్ సృజించెనీ
యిలాయొవండొవాని ♦ కేనుమ్రొక్కెదక్షమదికి 7

(అని మఱలం ద్రాగుచున్నాఁడు.)

దుర్బు—అన్నా! యెదీ చూతము (అని కొంచెము పుచ్చుకొని) వహ్వా.

భంగేత్రాగవలె ♦ బాలనేపొందవలె
యింగితమెఱుగని ♦ యింతులచెల్మియేల. భంగే. 8

(అని పాడుచున్నాఁడు.)

దుశ్చే—మనగానపానవిద్యల సంగతి యందఱెఱింగినదియె. వాఁటికేమి గాని నేనొక్కచిన్నమాట వినియున్నాను.

దుశ్శీ—అదియేది. మనసంగతి కాదుగదా?

దుశ్చే—అది మనసంగతిగాకున్న నాకేల?

దుర్బు—జాగుసేయక వేగవచింపుము.

దుశ్చే—ఏమియున్నది. నేటితో మనపనిసరి.

దుశ్శీ—ఏమి? నలిపినలిపి చంపెదవు. త్వరగా వాకృచ్చుము.

దుశ్చే—మీ కృత్యములు సరిగాలేవని యూరివారలు రాజుతో మొఱబెట్టుకొనఁగా మిమ్మను గారాగృహబద్ధునిగాఁ జేయనెంచెనే.

దుశ్శీ—నేను కొంచెము చూచాయగా పురజనుల ముఖవర్చస్సువలనఁ దెలిసుకొంటిని. గాని బాగుగాఁ దెలియకూరకుంటిని.

దుర్బు—ఏమీ ప్రభాకరుని మాధ్యము!

దుశ్శీ—ఔరా! ప్రభాకర! దుర్గుణగణాకర! (అనిలేచి)

చ. తెలియవొ కండ్లుగానవొ వి ♦ దేహుఁడనైతివటంచు నెంచితో
తలఁచవొ నీకు నేను యమ ♦ ధర్మజుఁడంచును, నాదు సద్భుజా
బలము నెఱుంగవో తులువ ♦ బందిగ మండెనబెట్టనెంచనే
నలగిన మూఁడుమూర్తులు భ ♦ యంపడనీవన నాకులత్యమే. 3

కానిమ్ము. నీకుమృత్యువుసమీపించనది. లేకున్నయిట్టి దుర్బుద్ధిపుట్టదు.

(అని తిఱుగఁ గూర్చునఁబోవుచున్నాఁడు.)

దుశ్చే—(లేచి) మిత్రమా! యాలసింపరాదు. ॥ఆలస్య మమృతం విషమ్మని యెఱుంగవే? (అని మిత్రుని చేయిఁబట్టుకొని పైకి నెత్తుచు)

శ్యామరాగం, ఆదితాళం.

రారా పోదాము ♦ రత్నగిరిమేడాకు,
యీ రేయి యా తేని ♦ విరాన బరిమార్ప॥ రారా॥
ధీరాత యాతని ♦ దారాను వేఁబట్టి,
మారూనికేళికి ♦ జేరాదీయవలె॥ రారా॥
చారులౌ యాజయ ♦ చంద్రచంద్రిలాను,
కౄరాతజంపంగ ♦ ఘోరాటవీకంప॥ రారా॥
తీరుగా నొకసారి ♦ త్రిమూర్తులడ్డైన,
వారింపఁగలండె ♦ వహ్వా మనకృత్యముల్॥ రారా॥

(అని యొకరిచేయి నొకరుపట్టుకొని గంతులువైచుచుఁ బోవుచున్నారు.)

[యవనిక జారును.]

---

ద్వితీయరంగము.

[ప్రభాకరుఁడు భార్యతో మేడమీద నిదురించు చుండఁగా, దుశ్శీలుఁడు, దుర్బుద్ధి, దుశ్చేష్టుఁడు ప్రవేశించు చున్నారు.]

దుశ్శీ—మిత్రులారా! మీరీకవాటమువద్ద మీ మాయాయుధములతో సిద్ధముగా నుండుడు. నే లోపలంబ్రవేశించి యాతనిఁబధలోక పట్టాభిషిక్తునిగాఁ జేసివచ్చెద. వాకొన్నదయిన వానిచేకూరుసప్పుడు మిమ్ములను సంజ్ఞాపూర్వకముగాఁ బిలచెద.

దుర్బు—మంచిది. ఇదిగో కైజారులను వరలనుండి తీసెదము (అని తీసిబట్టుకొని యున్నాఁడు.)

దుశ్చే—వేగమే యానృపుని బిలుకుమార్చి యాతనిరాణిం దోడ్తెమ్ము.

దుశ్శీ—అదియొంతపని.



(అని లోనఁ బ్రవేశించుచున్నాఁడు. మేడగదిలో నాక్రందనధ్వని, (హా నాథా! హా ప్రాణేశ్వరా! అని యేడ్పువినఁబడుచున్నది)

దుశ్శీ-(సుశీలతో) ప్రాణేశ్వరీ! యెక్కడిప్రాణేశ్వరుఁడు. అతడిప్పుడు ప్రాణవిసర్జనుఁడయినాఁడు. ఇటురమ్ము. (అని ఆమెను గది నుండితీసికొనివచ్చి.)

[illegible] బాలనీదు వల్లభుంగ్ర ♦ ప్రాణపాలుచేసితిన్
జాలమేల వేళమించెఁ ♦ జానరోతదీయభూ
పాలుమారుగావెసంశు ♦ భంబొసంగ నీవున
న్నేలుకొమ్మ రమ్మకొమ్మ ♦ యిచ్ఛవచ్చినట్టుగా.

సుశీ—(గదిపైపుఁజూచి) హాప్రియా! (అని నేలపయిఁబడుచున్నది.)

దుశ్శీ—(ఆమెహస్తమునుఁబట్టుకొని నేపనెత్తి)

లయిగ్రాహి. సుందరిమదీయహృద ♦ యేందిరత్వదీయముఖ
మిందునరవిందమును ♦ నిందయొనరించున్
డెందముమనోజకోల ♦ నందమినినుంగలయ
గుందుమను బాధలను ♦ బొందెదనుగాదే
యిందుముఖిమన్మథుని ♦ తొందరకుఁ జాలనిక
సందిటనుజేర్పవెయ ♦ మందగతి నేని
యందమునుజూచిభ్రమ ♦ జెందిననుఁబొందుటకు
నిందునరుదెంచితిని ♦ సందియమికేలన్ 2

సుశీ—(విచారముతో)

ఉ. ఏలరయిట్టితుచ్ఛగుణ ♦ మేలనుగ్గైమదీయనాథునిం
దూలగ నేసినాఁడ వయొ ♦ దోషమొకించుక లేద యుండినం
జాలి యొకింతలేక యిటు ♦ జంపుటమేలె దయావిహీనదు
శ్శీలుఁడవంచుఁబిల్చుటకుఁ ♦ జేకురు సార్థకనామమిప్పుడున్.

దుశ్శీ—(కోపముతో) ఛీ.

దుర్మతి. ప్రలాపినీ యిటుపేలా, విలాపము ల్విడకున్నా
యిలాపయింబడనెట్టి, తలన్ కఠారిని ద్రుంతున్.

(అని ఖడ్గమును జూపుచున్నాఁడు)

సుశీ—(గడగడ వడంకుచున్నది.)

దుశ్శీ—(ఆమెచెఱఁగుఁ బట్టుకొని లాగుచు)

క. వీలాజాలముచేసెద, దేలా యో బేలబాల ♦ యిటు పైనన్నిం
కేలీల దేలుకొనెదొను, శీలా! మది సిగ్గదేల ♦ చేకొనఁగదవే 5

సుశీ—(విచారముతో) ఓరీ నిర్దయాత్మ! భర్తనుజంపినదే కాక నన్నిటులబాములు బెట్టుట నీకున్యాయమా!

దుశ్చే—పోయినభర్త తిరిగివచ్చునా?

దుశ్శీ— లయగ్రాహి.

చక్కలను దేలుదొర ♦ దిక్కరనుజేయగదె
చక్కని ముఖాబ్జమిక ♦ నెక్కడనుజూడన్
ముక్కుతిలపుష్పమును ♦ జెక్కిళులునద్దముల
నెక్కొనినసంటులను ♦ మిక్కిలితొడల్ పెం
పెక్క నగచుండుగదె ♦ చక్కనికుచద్వయము
జక్కనల నెల్లనెక ♦ సెక్కములఁజేయున్
టెక్కులనుమానిదయ ♦ నెక్కడఁజూపి చెలి
గ్రక్కననుబ్రోవగదె ♦ మక్కువలుదీరన్॥ 6

(అని పైటచెఱఁగును బిగియలాగుచున్నాఁడు.)

సుశీ—(స్వగతమున) హాదైవమా! భర్త వియోగమునకై యార్తి జెందుచుండఁగా నీదురాత్ముఁడు చేతోజాతశస్త్రజాల దహ్యమాన మానసుండై కారులఁబలుచుచున్న వాఁడు. ఈతుచ్ఛునితో మాటలాడరాదు. కానిసమయము దప్పివచ్చినది గనుక మానము గాపాడుకొనుటకై యొకమాటచెప్పెదను.

సీ. సీతామహాదేవిఁ ♦ జెరబట్టినట్టియా, దశకంధరుండును ♦ దగ్ధుఁడయ్యె
పాంచాలిఁ గోరియా ♦ పాపాత్ముఁడైనట్టి, కీచకుడలనాడు ♦ గడసిపోయె
గౌతముదారను ♦ గౌతుకంబునఁగూడి శాపమొందఁడె పాక ♦ శాసనుండు
అనసూయపతిపత్ని ♦ నవమానమునుఁజేయ బద్మభవాదులు ♦ బాలురైరి

తే. గీ. అట్టివారలకన్నను ♦ దిట్టవౌదె? వారి వరుసలు దిగనాడి ♦ వలఁపుఁజెంచి
వల్లభునిజంపి నాతోను ♦ వాదమాడఁదలఁచి తిఁక జాలునీ మేలు ♦ తలఁపనేల.

దుర్బు—ఒహో! కొంచ మంగీకారసూచనభావము గాన్పించుచున్నయది. బాగుబాగు.

దుశ్శీ—ఓసీ! వారలసంగతియటుండనిమ్ము.

సీ. నందినీయనిమది ♦ సందియంబునులేక, పొందిన విధికియే ♦ నిందవచ్చె
గురుదారగోతుడు ♦ బరిమదోత్రినవనక, పెరిగిన సెలకేమి ♦ పరువుతగ్గె



మేనత్తతో పొత్తు ♦ మానహీనమనియు, పెనఁగిన హారికి నే ♦ ఘనతలఱిగె
మఱిదండ్రికూటమి ♦ విరసంబని యెఱింగి, పైగొన్న వ్యాసుకే ♦ వాసితగ్గె

తే. గీ. నెంచనట్టి మహాత్ములే ♦ మంచిచెడ్డ లెంచిరే యించుకైననునో ♦ యంచయాన
మించిమారుఁడునన్ను ♦ వంచింపదొడఁగె గాంచినదియాదిగానిను ♦ జెంచలాక్షి.

కావున నన్ను మారునిబారికిఁ ద్రోయక కూరతనుమాని నీసందిటనుజేర్చి కందర్పశరబాధలం దొలఁగింపుము.

సుశీ-అయ్యో! నేనునీకువదినను గాదా! వదినలు తల్లులతో సమానముగదా.

దుశ్చే—జగన్మో. చాలుచాలు నిట్టి ♦ జాలమేలనే సఖీ జాలమేలనే
బాలబేలవట్టి ♦ వాదమెందుకే చేలీ వాదమెందుకే
మీలు పెక్కగాదు ♦ మించివేచఁగాప్రియా మించివేచగా
గాలయాపనంబు ♦ గాగనెంచెదో ఖలా గాగనెంచెదో.

దుశ్శీ—(సుశీలతో) ఆహా! బాగుగావచించినావు.

చ. వదినలు తల్లులంచిటుల ♦ వాదమునల్పుచు నుండ నేలనో
ముదితరో! పూర్వమందమర ♦ పూజ్యుఁడుగీష్పతి వాలితమ్ముడున్
గదియరె? వారికింగలదె ♦ గామినితప్పులుగాన నీమనం
బిదియొకసందియంబువడ ♦ నేటికి నేటికి గోరుకూటమిన్ 10

(అని చెఱఁగును టరుగ బిగియలాగుచున్నాఁడు)

సుశీ—చాలు చాలు. నీ పరిహాసపు పల్కులు వాడిశరమ్ములయి నాహృదయభేదనంబు గావించుచున్నవి. ఇఁక నాయొద్దనుండఁదగవు పొమ్ము.

[ అని చెఱంగును విదల్చుకొనుచున్నయది. ]

దుశ్శీ—(చెఱఁగునువీడి కోపముతో) ఓచెలీ! మెల్ల మెల్లఁగ జెప్పిన సల్లాపములుగా యోచించుచున్నావుకాఁబోలు ఇప్పట్టున నొప్పుకొనకఁ బోయినచో తప్పక బలాత్కారముగాఁ బట్టెదను. అట్లు కాకున్న నిన్ను తుత్తునియలుగా నఱకెదను. (అని కత్తి నెత్తుచున్నాఁడు)

సుశీ—హా! రామచంద్రా! (అని నేలపయింబడి మూర్ఛవోవుచున్నయది)

దుర్బు—మిత్రమా! యీమె ప్రాణపదమగు ప్రాణేశు వియోగమునకుఁ గడుగుందుచున్నయది. ఒక్క నిమిషము తాళుదము. అదిగో జయచంద్రుఁడు చంద్రరేఖతో నిటకు వచ్చుచున్నవాఁడు. కావున మనమిట నిలువక నొక మరుగు ప్రదేశము జొచ్చి యాతని సంగతి కూడా కొంచెము కనుఁగొందము.

దుష్టీ—ఔను నీవుచెప్పినది బాగుగానున్నది. రండుపోదము (అని యొక మరుగుప్రదేశమునకుఁ బోవుచున్నారు)

[జయచంద్రుఁడు చంద్రరేఖతోఁ బ్రవేశించుచున్నాఁడు.]

జయ—(తల్లినిజూచి విచారముతో)

ఉ. పైటచెఱంగుసీడఁ గచ ♦ బంధముపూతిఁ గనూడ జెక్కుటల్
గాటుకనీరుగూడ మొల ♦ కచ్చలువేడిగ నాడ మోనిపై
హాటకభూషలూడ కడు ♦ హానియొనర్పఁగ మేడమీఁదికే
జూటరివచ్చినా డెచట ♦ జొచ్చెనొ చెప్పవె పిల్కుమార్చెదన్

[అని తల్లిని లేవనెత్తి విచారముతో]

ఉ. అమ్మరొ యిల్లుతల్లడిల ♦ నారడిబుట్టెరె యేరులేకనో
యమ్మరొ యొగ్గ చెడ్డకల ♦ నైననుగంటివె యట్లుగాక రా
జ్యమ్మునకైన శత్రులియ ♦ పాయముగల్గెనె చెప్పవమ్మ నే
నిమ్ముగ నీయభీష్టమును ♦ నిప్పుడె చేసెద నమ్మ యమ్మరో 12

చంద్ర—క. జననిరో! నడిరేయి నిటుల
ఘనతర శోకాబ్ధి మునుఁగ ♦ గారణమేమే
జనకుం డలిగెనె నీపయి
వనజముఖీ! దెల్పకేల ♦ వనట గృశింపన్. 13

సఖి—(విచారముతో) నే నేమనిచెప్పను కూనలారా!

సీ. ఆమ్నాయమనుమహా ♦ యబ్ధినిదాటింప, నోడయై మనల గా ♦ పాడు నెవఁడు
సంతానమను ఘన ♦ కాంతారమునుగ్రుమ్మ, సరణియై మనలను ♦ సాకు నెవఁడు
అన్వయంబను పెను ♦ యంధకారముఁ బాప, యిందుడై మనల ర ♦ క్షించు నెవఁడు
అన్వవాయంబను ♦ యాతపంబునుద్రోయ, ఘనమై మనలనెపు ♦ గాచు నెవఁడు
తే. గీ. నన్ను మిమ్ముల బాళితో ♦ మన్ననలను, నంకపీఠినినిడు నిష్క ♦ ళంకమూర్తి
యకట! యేమని జెప్పుదు ♦ నదిగో చూడు (అని శవమును జూపుచున్నది)
పాపి దుష్టులు చేసిన ♦ పరిభవంబు.

[అని యేడ్చుచున్నది]

జయ—(శవముపైబడి) హా జనకా! నాయట్టి కొమరుఁడుండఁగా నీకిట్టియిక్కట్టె సంభవించినది? నే నేమి సేతును. ఎందు జొత్తును? మాకెవరు దిక్కు. (అని గుండెలు బాదుకొనుచు)



క్రౌంచపద వృత్తము

హాజనకా నామీఁదలుకా నీ ♦ యనుఁగునుతుఁడను ద ♦ య నెడను చేర్పన్
ధీజనస్తోత్రా వాగ్ధనమిత్రా ♦ తిరమతినిగను మి ♦ దె ప్రియ సుపుత్రిన్
మాజననీనిన్నున్ పలుమారున్ ♦ మమతను విడువక ♦ మరిమరి గోరున్
నైజశరీరా ధైర్యవిహారా ♦ నరవర మొఱవిను ♦ నయముగబ్రోవన్. 15

(అని విలపించుచున్నాఁడు.)

చంద్రి—(విచారముతో) తే. గీ. జనకమమ్మింతదూరము ♦ గనినతోడ
గద్దెపైనుండిడిగ్గివ ♦ త్సమునవదిమి
జెక్కుటల్ నొక్కుతొడలపై ♦ చేర్చువాఁడ
విపుడలుక జెందమా పాప ♦ మేమియకట.

(అని యేడ్చుచున్నది.)

సఖి—(విచారముతో) తే. గీ. యిలనెలజవ్వనంబు న ♦ న్నలముకొన్న
దాదిగా నాదు బాళిమీ ♦ మీఁద జిక్కి
వ్రతములుపవాసముల్ సల్పి ♦ బ్రహ్మచేత
వరములొందితి మిమ్ముల ♦ వరుని గాత.

అదియునుంగాక.

సీ. నవ్వుటాలకునైన ♦ నొవ్వనాడెఱుఁగవు, కలనైన నాపయి ♦ నలుగవకట
నయినసంజ్ఞలకైన ♦ వదలింప నెఱుఁగవు, నామాట జవదాటి ♦ నడువ వయ్యరొ
తప్పుజేసినగాని ♦ దండించియెఱుఁగవు, కోపమించుకయైన ♦ జూపవహహా
కానిమాటలు నాడ ♦ కలహించు టెఱుఁగవు, యెవరి కేమిడినను ♦ జవుర వనఘ
తే. గీ. పరిణయాదిక్రియల్ ధర ♦ జరుగుటాదియొక్క రనిమిషంబైన ♦ నొంటిగాను
విడచియెచ్చట కైనను ♦ వెడలలేదు తగునె యిప్పుడు నాడి ♦ తరలిపోవ.

చంద్రి—స్త్రీవృత్తము. దేవా! నీవే, రావా, కావన్. 19

జయ—హా తండ్రీ! చిన్ననాటనుండి యరచేతి నిమ్మపండువలె పెంచియిప్పుడు నన్ను విడచి పోవుట నీకు న్యాయమా.

తే. గీ. దైవమా మమ్ములనుమాదు ♦ తండ్రితోడ బంపుమీ పట్టునరోగ ♦ బాధలకును
తాళ జాలము భక్తవ ♦ త్సలుఁడ వైతె నీదుదాసుని కోర్కెలు ♦ బ్రోదిసేయు.

సఖి—విచార వల్లరీ. నరనుతలీలకా ♦ నా పద్మనలుకా
పరగుచునన్ను నీ ♦ సందిలి నిడకా
ధరణిపథరపై ♦ ధర్మమెబదుటన్
[illegible]గుణా నా ♦ నేరము విడుమా. 21

జయ—హా! కన్నతండ్రీ! తే. గీ. నీకు ద్రోహంబు జేసిన ♦ నీచుని పుడె
పట్టిల్లార్చివటులైన ♦ వసుధమీద
తండ్రిఋణమును తీర్చిన ♦ తనయుడంచు
సూరు లందఱు మెత్తురు ♦ ధీరమతిని. 22

కావున నాదుర్మార్గుఁ డిందు నాకంటఁబడినచో నిప్పుడు మంటిపాలు గావింప కుందునా.

(దుశ్శీలుఁడు, దుర్బుద్ధి, దుశ్చేష్టుఁడు ప్రవేశించుచున్నారు)

దుశ్శీ—తులువా! యిప్పుడు కూసినకూఁతఁ దిరుగగూయుము.

జయ—(ఖడ్గమును బూని కోపముతో)

పంచ. దురంబునన్ గరంబునీదు ♦ దోర్బలాన గెల్చిపో
దరంబుకాకయుండ నేడ ♦ ధర్మవృత్తి నిద్రిలో
శిరంబుఁగోయ మానుషంబు ♦ చెల్లెనా దురాత్మ నిన్
బిరాన జంపివేయకున్నఁ ♦ జేర్మియేల కాల్పనే. 23

దుర్బు—(జయచంద్రుని ఖడ్గమును దీసుకొని దూరముగా గెంటివైచి)

తే. గీ. ఖడ్గమును బూని పై కరు ♦ గంగఁజూతు చాలు శూరత్వ మింకనో ♦ బాల! నీకు
నా నృపునకును దారత ♦ మ్యంబు నెంచ నస్తిమశకాంతరంబన్న ♦ యటులఁగాదె?

దుశ్చే—పౌరుషంబున కేమి యదికొని తేవలెనా! క్రియ చూపవలెను.

దుశ్శీ—(దుర్బుద్ధిని జూచి కోపముతో)

మత్త. చిన్నవారని యూరకుండిన ♦ జేటువచ్చును వీరిచే
మన్ననం బదియేలకో వన ♦ మధ్యకున్ దయమాలి వే
తిన్నఁగా గొనిపోయి యచ్చటఁ ♦ దీసివేయ శిరంబులన్
క్రన్ననం గొనిపొమ్ము రమ్మికఁ ♦ గాలయాపన జేయకన్ 25

సుశీ—(పిల్లలను గౌఁగలించుకొని) అహా! రమణుని మరణమునకే శిరముదరిగినటు లుండ కడుపుచిచ్చును గూడా కలిగించుచున్నాఁడు. ఇక నేటి బ్రతుకు? ఇదియే కడసారి చూపు.

[అని వారలను ముద్దు బెట్టుకొనుచున్నది]

దుశ్శీ—త్వరితముగాఁ దీసికొనిపొమ్ము.

[అని కౌఁగిలి విడువరకామెను, పిల్లలను బెత్తముచేఁ గొట్టుచున్నాఁడు]

దుర్బు—మంచిది. (అని పిల్లలను లాగుచున్నాఁడు)

చంద్రి—అమ్మా! అమ్మా! (యని యేడ్చుచున్నది)



సుశీ—ఛీ యిఁక నెట్లు జీవింపగలను! హా దైవమా! మమ్ముల నలుగురిని నీ చెంతనే జేర్పుము. (అని మేడకిటికీగుండా సముద్రములోఁ బడుచున్నది)

దుశ్శీ—ఆ! వీరిధావృ. నినుస్వేఁడన నను స్వీడన్, జనన్ బాలా! ఘనంబౌనే

(అని యామె చేతిని బట్టుకొన బోవుచున్నాఁడు)

చంద్రి—సోదరా! అమ్మ వారాసిలోఁ బడుచున్నది.

దుర్బు—మిత్రమా! వీరలను దలారి కొసంగెద.

(అని పిల్లలను దీసికొని పోవుచున్నాఁడు)

దుశ్శీ—(దుశ్చేష్టునితో) మిత్రమా! నాకీమె చిక్కినది కాదు గదా. తనసంతతిని బ్రతికించుకొనుటకైనను నాకోర్కె నెఱవేర్చినదికాదు. కానిమ్ము. రాజ్యపరిపాలనము నకు లభించినది. పోదము రమ్ము.

దుశ్చే—మంచిది. (అని నిష్క్రమించుచున్నారు)

తే. గీ. ధాత్రి నేలకంట్యాన్వయ ♦ ధార్మికులగు
లచ్చమాంబ లక్ష్మీపతు ♦ లకును గూర్మి
పుల్లఁడైన సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడెనిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## తృతీయాంకము

ప్రదేశమరణ్యము.

(జయచంద్రుఁడు, చంద్రరేఖ, తలారి ప్రవేశించుచున్నారు.

జయ—(స్వగతము) తే. గీ. కట్టనొక్కదుర్మతి చేన ♦ కారణముగ
తండ్రిసమసెనుతల్లిసం ♦ ద్రంబుజొచ్చె
మాకుఁగూడను ఘడియలో ♦ మరణమిచట
ప్రాప్తమాయుండెఁగాపాడు ♦ భక్తవరద.

చంద్రి—అన్నా! నేనింకొక్క యడుగైనను నడువలేను పాదంబులునెత్తురు చిందుచున్నవి. (అనికూర్చున్నది.)

జయ—(విచారముతో)

ఉ. ఓయితలారిమమ్ములను ♦ నూరకద్రుంచఁగనీకునక్కటా!
చేయెట్లులాడు మేమిపుడు ♦ చేసిన దేమి? వృథా శిరంబులన్
గోయుఁడటంచు నాజ్ఞనిడ ♦ కూరిరున కేవిధమైన హానియున్
జేయఁగలేదు జేసినను ♦ జెల్లునె కుఱ్ఱల మమ్ముఁజంపగన్.

చంద్రి—(తలారితో విచారముగ) ఓయీ! మాయట్టి చిన్నపిల్లలు నీకును నుండిరిగద. రాజాక్రూరుఁడై యాజ్ఞాపించినను మమ్ములనుచంపక యీయరణ్యంబునందు విడిచి పోరాదా? (అని బ్రతిమాలుచున్నది)

తలారి—(చంద్రరేఖను దూరముగా నెంటివైచి కోపముతో)

క. విడచుటకు నాకును సమ్మతిలేదొకఁ ♦ వేడ్కనమిమ్ములఁద్రుంచెదఁగా
తడయఁగనేటికి భూవరునాజ్ఞలు ♦ దప్పు నధర్మముగా దధిపున్.



గడగడ జంకిన మానెదువాఁడను ♦ గాను నిజే వధియించెదఁమీ
మెడమల్లు నిల్పిశిరంబులు వంచి సమానముగా నిలుచుండుడికన్

(అని కత్తి గిరగిరం ద్రిప్పుచున్నాఁడు)

చంద్రి—(అన్నగారిం గౌఁగలించుకొని యేడ్చుచు) హా! సోదరా! తుదకు మనగతి తొల్లాయెను!

జయ—(స్వగతమున) హా దైవమా!

ఉ. ఇద్ధర మాదునాన్నతికి ♦ నెంతటినూరులు ధీరులైన జల్
బద్దులుగాగ నేడొక యు ♦ భాగ్యునిబట్టి దురాత్మునాజ్ఞకున్
బద్ధులమైతి మేమనఁగ ♦ వచ్చును మేడలు మిద్దెలౌనుగా
మిద్దెలు మేడలౌననుచు ♦ మేదిని పెద్దల పల్కుబద్ధమే.

[చంద్రరేఖ గడ్డమును బట్టుకొని విచారముతో]

ఉ. చెల్లెల! నీవు నేఁడిటుల ♦ జింతిలనేటికి దైవయోగమున్
దెల్లకమాన దేరికిని ♦ జీబగు కానసమందు డాఁగినన్
దల్లడ మొంద నేల మన ♦ తల్లియుదండ్రియు వీడియుండఁ జిం
తిల్లగ నేటికమ్మ విధి ♦ దీటుగ వ్రాసినవ్రాత తప్పునే!
అయినను ఘనలనుజూచి సంతసించువారలు లేరు. ఏల! నీపుడనిపై గడుసిదుమలు గుడుచుచు బ్రతుకుపట?

ఉ. బాలరో! దుఃఖమేల పెర ♦ పంచలజేరి ప్రభాకరాజ్యము
శ్రీలురసంతతంచు జన ♦ సేవయొనర్చుచు బొట్టకోసమై
కాలము పుచ్చుచున్బ్రతికి ♦ కష్టము లొందుటకంటె ప్రాణముల్
మేలుగఁగాదె వీడ ఘల్ల ♦ మే మిలదీనుల మాచు నిల్వఁగన్.

తలారి—ఏలా? యీజాగు, ఆలసించిన మాయేలికకుఁ గోపము రాఁగలదు. ఇంక నొక్క యరనిముసంబు నాగెద. (అని కత్తిని సవరించుచున్నాఁడు)

జయ—తే. గీ. దైవయోగంబు నేరికి ♦ దప్పవశమె
వంత పలదమ్మ చెల్లెలా! ♦ వసుధమీద
తాపకుందురె జనులివి ♦ చారఫేల
వేడుమింకను ముక్తికై ♦ వేదవేద్యు.

తలా—ఇదిగో (అని కత్తి పైకిదీసి) యింకొక్కరనిముసంబులో వేదుదురుగాని.

జయ—(చంద్రరేఖ భుజములపైఁ జేయివైచి భూమిపైఁ జూచుచు)

దండకము. దేవాదిదేవా! కృపాపూర్ణభావా! విపద్వారివారాశిని న్నిప్పు దాటింపగా నావ నీవేగదా యెంచు నామానసంబందు నిన్నెంచి యేనించుకన్ వేఁడుచుంటిన్ దయంజేసి నాపల్కు లాలించి లాలించి పాలించుమో తండ్రి! మా తండ్రి నిర్హేతుకంబుగా గద్దుం గ్రూరుఁడై జారుఁడై చోరుఁడై పాపదుష్కీలుచే నేర మొక్కింతయున్ లేకయే యర్ధరాత్రంబునం బ్రాణముల్వాసె నప్పెంతతోఁబోక మా తల్లిచేఁబట్టి తాఁ గట్టిగాలాగి పీనస్తనీ! యారతీదేవిచే చిల్కమైపన్నిగోఁజన్ బైడి తళ్కున్నగంజాలుకల్కీ! తమిం దీర్పవే ముష్టుసుల్కంగ నాకమ్మపిల్కని పూ ముల్కిందాళ నోబాల! యీవేళ జాగేలనంచున్ బలింబట్టఁగా బిట్టువాపోవుచుం జేలమైయేడ్వ నాయేడ్పునాలించి కోపించి ఖడ్గంబుచేఁబూని దుర్మార్గుఁడై కేగఁగా జూచి రోషంబునం జెంది మీసంబులందుప్పి హుమ్మంచు నంతందలారి న్వెసన్ బిల్చి ఘోరాటవీమధ్యకున్వీరి గొన్పోయి యచ్చోట వాటంబుగాఁ గుత్తుకల్ గోసి యా నెత్తురుం దెమ్మటంచానతీయం విచారించి యింకేటి కీపాటికిన్ బ్రాణముల్ బాయ నేమంబహోయంచు మాయంబకాయంబు పైఁబోసి వారాసిలోఁ జొచ్చె రాజాజ్ఞ నుంబట్టి యిచ్చోటికిన్వచ్చుటయ్యెంగదే దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ! లసద్భూరికీర్తీ! మముం గావుమా దిక్కులేకున్న దైవంబె దిక్కంచు పల్కంబుఁ పెద్దల్ వచింపంగ వింటిగా నంటిగా నుంటిమో జానకీలోల! శ్రీవేణుగోపాల శీలా! నమస్తే నమస్తే నమః.

తలారి—(కత్తి సవరించుచు)

ఉత్సాహ. చంపఁ దలఁచినాఁడ మిమ్ము ♦ జాలమేల వేళ లే
దింపుగాను దలలువంచు ♦ (అని వారితలలను క్రిందికివంచి)
డిద్దరన్ క్షణంబులో
జంపినైతు యమునిపురికి ♦ ప్రభువు మెచ్చునటుల జిం
తింపనేను విడచువాఁడ ♦ నే వధింపకుండఁగా.

[అని కత్తి గిరగిరం ద్రిప్పి క్రిందఁబడి కొట్టుకొనుచున్నాఁడు) అన్నన్నా! యాదురా త్మసాజ్ఞవిని యజ్ఞానులగు కుత్తులం జంపనెంచిన నాయత్ని తుచ్ఛునకిట్టి కష్టము రా వలసినదే. (అని విగతప్రాణుండగుచున్నాఁడు)

[జయచంద్రుడు, చంద్రరేఖ, కనులువిప్పి విస్మయమొందుచున్నారు]

జయ—అయ్యో! పాపమాతనకత్తి యాతనికే దగిలి మృతినొందినాఁడు.

చ. చెలియల! చంపివేయుటకుఁ ♦ జేసినయత్నము భంగమయ్యెనీ
తలవరి ప్రాణముల్విడిచి ♦ ధాత్రిపయిం బడెనిప్డు చూడుమా



కలియఁగ బోదు దైవికము ♦ ద్రిప్పటశక్యమె ధాతవ్రాతయున్
దలఁచినఁ దానునొక్కటెని ♦ దైవము వేఱతలంచు నొక్కటిన్.

అదియునుంగాక. గీ. దిక్కులేకున్న దైవమే ♦ దిక్కటంచు
సామెతను జెప్పురీతిని ♦ సరసవరులు
దలఁప నిప్పుడు సాక్షిగా ♦ దప్పకుండ
దోడ్పడియె నేఁడు మనలకుఁ ♦ దోయజాక్షి.

చంద్రి—ఆహా! యేమియదృష్టము. ఎంత కష్టదశలోనున్నను ప్రాణములు గోలుపోవుటకు మనసొప్పదుగద. ప్రాణముతో సరియైన వస్తువు మఱియొకటి గానరాదు గదా. అన్నా! మనమిప్పుడు జావకుండ బ్రతుకుట ముందెద్దియో గొప్పదశ ననుభవించెదమని తలంచెద.

జయ—అమ్మా! ఈకాంతారంబు సొంతంబుగా గడచినపిమ్మట నటుయోచించవలె.

చంద్రి—అన్నయ్యా! కాననమందు చిటపట ధ్వనులు గలిగి భూమ్యాకాశంబులు వాంటలుగ్రమ్మి పొగఁజిమ్ముకొనుచు నెద్దియో మనదెసకు వచ్చుచున్నయది. (అని భయముచే నన్నగారి ప్రక్కకఱగుచున్నది)

జయ—అమ్మా! భయపడకుము.

కం. అదియొక పన్నగ మెన్నగ
బెదరక యిచ్చోట నిల్వు ♦ విడతు నె మావం
కదిమెడమున నరుగఁగ నద
మదమును జేతునిదె దాని ♦ మద మడగంగన్.

(అని కత్తిఁ దీయుచున్నాఁడు)

చంద్రి—సోదరా! నాకై ప్రమత్తుండవై సాహసింపకుము.

జయ—భయపడకుము. (అని దానిని వధియించుచున్నాఁడు)

చంద్రి—ఆహా! క్షత్రియవంశసంభూతుండవైనందులకు శౌర్యము నిల్పితివి.

జయ—అమ్మా! ఇదియెంతపని.

చంద్రి—అన్నా! యీవనంబున ననేకధ్వనులేగాకుండ ననేక చిత్రములుగా గాన్పించుచున్నవి. అవియెవ్వియో చెప్పుము.

త్రిభంగివృత్తము.

జయ—చెలియల! శుకములు ♦ కలరవముల పిక ♦ ముల మృదుభాషణవింటే
[illegible]

కలికిరో! కరిఘటా ♦ గజశరభ సలులు ♦ కను భయమార్భటమెన్నన్
మునిగిన్నక్కా భీతియొనిస్సన్
సొలతుకా! కుటజవకులతిలకములిను ♦ కుల సుసక్రాంతుకాచెన్నన్
తపిందగస్సన్ సంతసమెన్నన్
నెలకుతా! లతల విటపిల ఫలముల సొగసుల నతివేగ మెబ్బలా
కసవేలా భానుతిశిలా

(అని చూపుచు నేల పయిం గూర్చున్నాఁడు)

చంద్రి—అన్నా! ఏల బేలవయి నేల జతికిలం బడితివి? విశ్రాంతిం జెందితివి కాఁబోలు.

జయ—(పాదముఁ జేతితో బట్టుకొని)

ఉ. కొమ్మరో! ప్రాణమందు ముసులు ♦ గుచ్చుకొనంగదె యోపనోపనో
యమ్మరో! సద్వ్యాజాల నిక ♦ నాపలనించుక యైనఁగాని పా
దమ్మున లక్ష్మి వేయిదియన ♦ దారుణముద్దిగవేసి నట్టుగాఁ
దివ్వెరలెత్తుచున్మనసు ♦ దిమ్మగ జేయుచు నున్నదక్కటా. 12

చంద్రి—(కూర్చునిపాదముఁ జేతితో బట్టుకొని) అయ్యో! రక్తము వచ్చుచున్నది. (అని తన చే రుమాలును రెంటిగాఁ జీల్చి పాదమునకుఁ గట్టుచు) హా దైవమా! దీనరక్షకా! యాపద్బాంధవా! దీనశరణ్యా! "తగిలినచోట నే నొగులుట" యనురీతిగా, నిదివఱకే బాధలచే గుందుచుండఁగ నిదియొక కష్టమునుఁ గూడఁ గలుగఁ జేసితివా?

(అని మూర్ఛపోవుచున్నది.)

జయ—(ఆమె పైఁ జేయివైచి దువ్వుచు శిరస్సుఁ దొడలపై నిడుకొని) అమ్మా! చంద్రిరేఖ! చంద్రిరేఖా! (అని పిల్చుచు విచారముతో)

ఉ. క్రొలుపక్షిభాకరాఖ్యునకు ♦ రాజిలుపత్నిసుశీలరాణికిన్
బ్రాణి ననుంగుఁ దోతువయి ♦ బాలరో! నాకును ముద్దుచెల్లెవై
నేలనుబంధుకోటిగద ♦ వీరజగర్భునివ్రాత తప్పునే?
కాలవశం బదేటికిని ♦ గాకతొలంగునె బాలికామణీ! 13

ఆహా! "గోరుచుట్టు పయిరోకటిపోటు" అన్నటుల నిదివఱకుండు కష్టములకన్న నీబాధయెక్కువయ్యెనుగదా. దైవమా నేనెందుఁ బోదు (అనుచునామెను ముద్దు పెట్టుకొనుచు విచారముతో)

సీ. అన్యాయమా! నామీద! నలిగినట్టిరీతి, కన్నుపిల్చినఁజల్ల ♦ వేమిచెల్లె
ప్రాణంబునకుబ్రాణ ♦ పదమువీడిపోయెనె, ప్రాణంబునస్తోల! ♦ బాయదమ్మ



యొంటిగాఁ జరియింప ♦ జంటవై తివి నాకు, కడగండ్లనీ కేలఁ ♦ గలిగెఁ గూన
కరనంపు దేవుని ♦ కన్నులకీవును, జలువైతివేమనం ♦ గలసుదల్లి

తే. గీ. బాలనీరూపు నీసారు ♦ లతయును మరపువచ్చునె యెన్నిజ♦న్మములకైన
నీకు నాకును నేటితో ♦ నిటులఋణము చెల్లఁజేసెనుఁ గాఁబోలుఁ♦జిన్నికుట్లి.

నాకింక నేటిబ్రతుకు!

చ. జనకుఁడు నగ్రరాత్రిమున ♦ జంపఁబడెన్విన తండ్రిపుత్రిచే
జనని విచారసాగరము ♦ వైపక సాగరమందుఁజొచ్చెనే
వనమునమూర్ఛనొందెగుణ ♦ వర్ధని చెల్లెలు భీతచిత్తయై
యనఘ! దయామయాత్మ! నను ♦ నంతము సేయవె నీకు మ్రొక్కెదన్.

అన్నన్నా! ఎంతపనిసంభవించినది.

సీ. అంతిపురంబుల ♦ నలరుచుండెడుబాల, ఘోరాటవులయందుఁ ♦ గుందవలసె
పాయసాన్నంబులు ♦ భక్షించు పసిబిడ్డ, యుపవాసములదూలి ♦ యుండవలసె
వీణావినోదియై ♦ కిలకిల్లు లతకూన, ఘనమృగార్భటముల్ ♦ వినఁగవలసె
ధర్మ్యడోలికలపైఁ ♦ బవ్వళించెడుబాల, బండఱానేలపై ♦ బండవలసె

తే. గీ. సకట! దుష్కలు చేనిట్టి ♦ యార్తివచ్చె ధాత నుదుటను వ్రాసిన ♦ వ్రాతయేమొ
వ్రాత గాదిది మాకర్మ ♦ ఘాతగాని కానియెడ నిట్టికష్టముల్ ♦ గలుగుటున్నె.

ఆహా! యెంతప్రాలుమాలిన వాఁడనై దైవమును దూరుచుంటిని. కష్టదశలోనున్నప్పుడు మంచిచెడ్డలు తెలియవుగదా! ఈమె మూర్ఛపోయినది నిజముగాఁ బ్రాణములు పోయిన పక్షమున ముఖవర్చస్సు తగ్గదా? ఉశ్వాసమాడుట మానదా? కావున వేగఁబోయి జలంబులు దెచ్చెద.

(అనియామెను ముద్దుబెట్టుకొని విచారముతో)

మందాక్రాంతవృత్తము.

తల్లిదండ్రులు స్మరణమునసం ♦ తాపము న్నెప్పుడైనా
యుల్లంబేవేళలతహతహా ♦ లొన్నెందుచుండన్ కటాయీ
చెల్లెల్ పీడన్ హృదయమెటులం ♦ జెల్లు నిట్లొంటిగా నా
కాళ్ళుంజేతుల్ గదలుటెటులీ ♦ కానపాల్ జేసిపోవన్. 17

ఔరా! నేనింక జాలముఁ జేసినయెడఁ దప్పకహాని రాఁగలదు. ఇచ్చట నెక్కడైన సరోవరంబుగలదేమో చూచెదను.

(అని వృక్షముపైనెక్కి నలుదెసలం జూచి) అదిగో! మాపు



క. స్థిరమైమునులకు శ్రీయ,స్కరమైయన్నిఁటికి ♦ సౌఖ్యకరమైకమలా
కరమైయతిరమ్యశ్రీ, కరమైవిలసిల్లె నహహ ! ♦ కాసారంబుల్.

కావున వచ్చోటికింబోయి జలంబులందెచ్చెద. (అని క్రిందికిదిగి చెల్లెలిని ముద్దుపె
ట్టుకొని) అమ్మా! నినువిడచి యేగుటకుఁ బ్రాణమొప్పుటలేదు. ఏలయన

చ. జనని సుశీలగర్భమున ♦ జన్మమునొందిన దాది ధాత్రిపై
ననయము నొక్కకంచమున ♦ నామెతగొందమను నిర్వురుంసదా
నెనరుగ నేకమంచమున ♦ నిద్దురఁజెందితి మమ్మ యిప్పుడీ
వనమున నిన్నుఁబాసి చన ♦ వ్రాసెనె ధాత దయావిహీనుఁడై. 19

ఆహా ! నాకు మఱియొక యుపాయమేమియుఁ దోచకున్నయది.

చ. చెలియలనొంటిగా విడచి ♦ జీవనముల్ గదువేగఁదెచ్చి యీ
సిలుగును దీర్తు నన్ననిఁక ♦ జీవనమెట్టులు నిల్చుబాసినిం
జెలువరొ! యూరకుండు నెడ ♦ జీవముపోవు గదమ్మ నీకు ముం
గలి జన గొయ్యి వెక్కుచన ♦ ఖాతముసామెత యయ్యెనియ్యెడన్.

కాని సర్వరక్షకుఁడైన దైవమున్నాఁడు ఆలస్యముఁజేసిన బ్రాణహాని రాగలదు.
వేగబోయివచ్చెద. (అని యామె ముద్దుపెట్టుకొని లేచి నాలుగడుగులువేసి తిరుగ
నామెచెంతకు వచ్చి కూర్చుండి ఆమె శిరముతొడపై నిడుకొని ముద్దుపెట్టుకొని)

ఉ. ఎంతలొ నెంతనిర్దయవ ♦ హించితి నమ్మరో నిన్నుబాసి కా
కాసింతయుబాళిలేక విడి ♦ యేగగనెంచితి తల్లి దండ్రికై
వంతలు గుందుచుండమును ♦ వాటిలెనీకిపు డీవిపత్తు నా
మంతనమందు ప్రాణములు ♦ మానినిరో యిఁక నిల్పు టెట్లొకో.

అకటా! నాయార్తారవము వినువారెవ్వరు? యేల యీజాలము. కాలయాపనజేసి
న తప్పక ముప్పురాగలదు. ఇచటనున్న కాంతారగణములకు నప్పగించిపోయి యొ
క్క నిముసములో జలములతో నిక్కడకేగెద.

[అని బిగ్గరగా]

సీ. హంసలార కథులార ♦ తరులార విరులార,కావరే చెల్లెలిఁ ♦ గరుణతోడ
మునులార వనులార ♦ గనులార కనులార. గావరే చెల్లెలిఁ ♦ గరుణతోడ
నదులార పొదలార ♦ గుదులార మధులార, కావరే చెల్లెలిఁ ♦ గరుణతోడ
అళులార పులులార ♦ వళులార శిలలార, కావరే చెల్లెలిఁ ♦ గరుణతోడ
తే. గీ. నిచట బడినాడి నీటికై ♦ యేగుచుంటి,నప్పవలయును చెలియలి♦నిచ్చలోడ
గావలగదరయ్య యాశ్రిత♦గణానులార,పోవ నెలతని కొలనికిఁ ♦ బోదువేగ.



[అని చెల్లెలను ముద్దుబెట్టుకొని లేచి]

అమ్మా! కఠినహృదయుఁడనైనిన్ను విడనాడిపోవుచుంటిని.

[అని యామెదెస తిలకించుచు వెనుకవడకగాఁ బోవుచున్నాఁడు.]

చంద్ర—(కొంతసేపటికిలేచి) అన్నా జయచంద్రా! జయచంద్రా! ఎచ్చటకుఁబోయి
యుంటివి? సోదరా! నేనొక్కతె నిక్కాననంబున నుండఁగలనో లేనోయని న
వ్వులాటలకు నెచ్చటనైనను డాగియుంటివి గాఁబోలు. నేను నిన్ను విడిచి యొక్క
ముహూర్తమాత్రమైనను నిల్వఁజాలను. రమ్మా. రమ్మా. (అని కేకలు వేయుచు
న్నది. విచారముతో)

ఉ. అన్నయ యిట్లుసేయతగు ♦ నా? పగ నేదిగ నాడనీకయో
నన్నిటఁబ్రోచు వారెవరు ♦ నాయమెకానలపాలుసేత నీ
కన్నయనుంగులంప్రలిల ♦ గాంచగనున్న గదన్న లేచిరా
వన్న శమింపుమన్న శర ♦ ణన్నను సాక పదేమి సోదరా! 23

ఔరా! ఎంతపిల్చినను జాడలేదు. నామీఁదఁ గోపమువచ్చినది. ఏమి చేయుదును.

ఉ. అన్నయ! నిన్ను నెన్నడేదు ♦ రాడుటలేదు పరాకుసేయఁగా
జన్నె! కనన్నినుల్ జనకు ♦ నాయనెమున్ననఁ జేయుచుండఁగా
నన్నిటఁజూతుపంచుకల ♦ నైనను నెన్నఁడుఁ గాంచనైతి నా
పిన్నపన్మాలకించినను ♦ వేగమెబ్రోవఁ గదన్న వేడెదన్. 24

ఆహా! ఎన్నిసారులుపిలిచినను బలుకడు. ఏమిసేతును. (అనియేడ్చుచు)

మంజరీ. ప్రణుతాఖ్యనుతా ♦ వరశీలన స
జ్జనభూషణ దు ♦ ర్జనదూషణవే
వినుచెల్లెల నీ ♦ విపినంబున ద్రో
చను నీమదికిన్ ♦ జనువేయనుజా. 25

ఇంకనైనవచ్చి నన్నాదరింపవా? నేనేమి పగఁజేసితిని. ఒకవేళ నజ్ఞానినై చేసినను
మన్నించుట నీకు యుక్తముకదా. నన్ను విడచుటకు నీకెట్లు మనసొప్పెనో తెలి
యదు. ఏలనన

సీ. ఘనదుఃఖవారాశి ♦ మునుగువాఁడవో కావొ,నాకుమైస్వస్థత ♦ లేకయున్న
నీవు నాతోపాటు ♦ నిరహారముండవో,కినుక నాహారంబు ♦ తినకయున్న
అమ్మతల్లీయంచు ♦ నలమటజెందవో, యేనొక్కగడియు ♦ కాన్పించకున్న
పల్లెత్తుమాటైన ♦ బల్కనౌ నంగవో,పట్టినపట్టునే ♦ వదలకున్న

తే. గీ. ఏలనాపయి నేఁడిట్లు ♦ జాలివిడచి, తరలుట గన బుణానుబం ♦ ధమ్ము దీఱె
ప్రాణపదమయినవస్తువుఁ ♦ బాసి వేగ, చనుదురని యెదు నార్యోక్తి ♦ సత్యముగద

అయ్యయ్యో! ఇంకనిన్నువిడి నేనీఘోరారణ్యంబున నెట్లుమనుదు. నాకెవరుదిక్కు,
(విచారముతో)

పల్లవి. అన్నయనాపై ♦ మన్ననవీడక
గ్రన్ననకానాపల్ ♦ జన్నెటుచేయక. 27

(కొంచెము ధైర్యముఁ దెచ్చుకొని) ఆహా! నే విచారించినలాభమేమి! అతని గుణ రూపలావణ్యముల నానవాలుదెల్పి యీవృక్షముసముదాయంబునడిగెదను. ఓపాదపములారా!

సీ. కల్లనైననసృతంబు ♦ బలుకనేరనివాఁడు, ధర్మమే జయమని ♦ తలఁచువాడు
ఆర్యులఁగనుఁగొన్న ♦ నతివినమ్రుఁడగువాఁడు, పరులసొమ్మునకిచ్చఁ ♦ బడనివాఁడు
ప్రజలసుఖమ్ములఁ ♦ బడయఁగోరెడువాఁడు, ప్రాణిహింసకునుజొ ♦ ప్పడనివాఁడు
జనులునిందించినఁ ♦ గినుకఁ జెందనివాఁడు, సజ్జనమైత్రియే ♦ సలుపువాఁడు
తే. గీ. సుగుణగణవతిఁ జూడఁగ ♦ సొగసుమూర్తి, నరసినుతకీర్తిసంతతా ♦ నందవర్ధి
తోషితబుధాలి సజ్జన ♦ చక్రవర్తి, ఎచటకేగెనొ తెల్పరే ♦ యిపుడు మీరు. 28

అన్నా! మీయెడ నేనేమిపగఁ జేసితిని. నాపయి యింత చలమూనుట. (అని లేచి ప్రతివృక్షము చెంతకుఁబోవుచు.)

సీ. సహకారకానవే ♦ సజ్జనసహకారు, సాలమకానవే ♦ పాలనేత్రు
చందనకానవే ♦ జయచంద్రచంద్రుని, మందారగానవే ♦ మందగామి
కేసరకానవే ♦ కేసరీపరిముఖు, వకుళమాకానవే ♦ వకులశ్రేష్ఠు
పున్నాగకానవే ♦ పున్నాగతిలకుని, యర్జునకానవే ♦ యర్జుననిభు.
తే. గీ. తాలతక్కోలతపనహిం ♦ తాలనీలిక్రముకకరవీరఖర్జూర ♦ కదళికాది
పాదపములార! నాప్రియ ♦ సోదరుండు బోవుమార్గంబు దెల్పరే ♦ సేవఁజేతు.

ఔరా! నేనెంతవేడినను బదులు మాటాడక తలలు విఱ్ఱవీగించుచున్నవి. అకటా వీనిని నిందింప బనియేమి?

తే. గీ. అధికులకుఁ గాలవశమున ♦ నల్పులసర వలసి నేమియు గర్వించి ♦ పలుకరకట
కానపురలు తరువులై ♦ గహనమందు పుట్టుదురని యార్యులుబల్క ♦ వట్టిదగునె.

గావున వీనికేటికెరుఁగ? ఎక్కడిపరలోక చింత? వీని వడఁగుటనాదియే కదా బుద్ధిలోపము. (అని వలుచెంతలబతికించి) అదిగో! కిరాతుఁడొకఁడు జిగు[illegible]



ఉరి, వల, ఉచ్చులు, వింటిబద్ద మొదలగు వానితో వచ్చుచున్నవాఁడు. వానినడగెదను
(కిరాతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కీర్తన.

1. వనంబులందున - మనంబుచెడి - యిటు - వనర
బొందనేలా? వృథావిచారించనేలా?
2. రమ్మానా - దుగ్ధ - హమ్మునబెనచి - బలు
సొమ్ములిడిదెబాలా! లెమ్మిక - నిమ్మగ జనబేలా!
3. అయ్యోనీ మొర - కుయ్యాలించగనె - నెయ్యమొదవె తల్లీ.
ప్రియమూతువుగుణముల పాల్వెల్లీ!
4. జాగేలను బోవలె - బాగుగ నాతో
వేగముగారమ్మా - సొగసుల శృంగారపు బొమ్మా! 31

చంద్రి—ఓయీ బోయీ! యెచ్చటనైనను మాయన్నయగు జయచంద్రుని గాంచితివా?

బోయి—(తనలో) వహ్వా! యీచిన్నకన్నియ నాకు బాగుగాలభించినది.

తే. గీ. సంతుకొఱకు నరబలియొ ♦ సంగు నేని కలుగునదియంచు బెద్దలు ♦ వలుకుచుండ్రి
దీనిఁగొనిపోయి కాళికా ♦ దేవి కేను బలియొసంగెద సంతాన ♦ పదవికొఱకు.

[ప్రకాశముగా]

పాదపవృత్తము. అన్న నెఱుంగను ♦ నమ్మ నెఱుంగని
దిన్నగఁ నేఁజను ♦ తెన్నున రమ్మో
పన్నగవేగులఁ ♦ బంపగనేనీ
యన్నయు రాఁడెర ♦ యంబునఁ జూడన్. 33

(అని యా మెకరమునుబట్టి తీసుకొని పోవుచున్నాఁడు)

తే. గీ. అవనిగుణగణుఁడో బాపు ♦ నాహ్వాయునకు
రమణమాంబకును గనిష్ఠ ♦ భ్రాతయైన
యలఘుసుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## చతుర్థాంకము

పరివేశము—వింగుర్లాసముద్రము.

(జాలరివాండ్లోడమీదుంగా పరివేశించుచున్నారు)

తెడ్లుపదము. నే [illegible]వసినాది హైలేసా మేలిమిబంగారు హైలేసా.

ముగమునందురినిబోరు హైలేసా నగవువెన్నెలగేరు హైలేసా

చనులుబంతులు నేలు హైలేసా కనులుకల్వలగేలు హైలేసా

నడలుకరులనుమీరు హైలేసా నుడులుయమృతమీరు హైలేసా

సింగారమేమందు హైలేసా చెంగావిసీరగట్టె హైలేసా

రంగుగకుస్సిళ్ళు హైలేసా ముంగలికి సీరాడె హైలేసా

సోయగమేమందు హైలేసా మాయూరకీల్బొమ్మ హైలేసా

కురులుచీకటినేలు హైలేసా మరలుకున్నది నిన్ను హైలేసా

మొద—(తోడివారితో) ఓరోరి! యెంతో రేతిరి లేదుగేందా. వక్కతూరైనా వలవే యులేదే?

రెండ—ఓరబ్బోసి! యింకా రెండు జేములు రేతిరుండేరా. కుళ్ళుకూరుకొని పోతు న్నాయాపి.

మూడ—ఓరి నిదరపోతా! జెడగొండలాగు మోగాలు బట్టి దడబడలాడుసుండ రేతి రుండనుకొంటివేర్రట్రా.

నాల్గ—ఓరీ! యిప్పాడేకాదంటొసి. జాముకోడి కుక్కురూయంటూ గూసింది.

అయి—జాము రేతిరి కన్నెక్కుడుండినేని నావల సేపలన్ని చ్చేటుద.

మొద—(రెండవవానితో)

సుగంధి. ఏరసీకు యింతనిదర • యేవరైనా నాగర

రెండ— బోరబోర నిదరయింటు • [illegible] యుందువో



నాల్గ— యోరిరేతిరి రెండుజేము • లుండలేపు రేటిరా

అయి— మీరుమీరు గుద్దులాడ • ఖింసిపోనదేమిరా.

మూడ—(తోడివాండ్రతో) మొన్నశనారం యేటకెళ్ళానుగందా. యెన్ని సేపల దొరకాయని సెప్పను. చోర, పాలచోర, కొమ్ముచోర, గుమ్మడిచోర, గున్నచోర, యెన్నచోర, తిండిచోర, తిక్కచోర, పెదచోర, ముట్టచోర, పండుగొప్ప, మాలతప్ప, ముసచెప్ప, తిక్కమొప్ప, తినిమొప్ప, చాకలిమొప్ప, యీతితిప్ప, చెమ్మిపాము, పెదచెమ్మిపాము, పులిపాము, ములుసుపాము, ఓరబ్బోయింకాయెన్నో శెలగోశెలగ.

నాల్గ—ఓసియింతేనా? నాకుదొరికినవి లెక్కేలేదు జల్ల, బుర్రజల్ల, నల్లజల్ల, యర్రజల్ల, ముట్టిజల్ల, కోడెముక్కుజల్ల, బుర్రముక్కుజల్ల, గడ్డిజల్ల, పంతకోడిజల్ల, గొడ్డ పాటిజల్ల, బంగజల్ల, చీగిజల్ల, రాటిజల్ల, రేయి, గాజురేయి, పప్పురేయి, కండాపు రేయి, యిలరేయి, దామరేయి, బుంగరేయి, సీలరేయి, ఏలెర్రయి, నీలకంతరేయి, తేటరేయి, కంకిరేయి, శింగిడిరెయిలున్నా, పీత, పులిపీత, యెలుగుడుపీత, మండపీత, పాలపీత, సనాయిపీత, రాతిపీత, యెర్రపీత, తుండిపీత, గుడ్డిపీత, సాలిపీతలున్న రేకి, యాలంరేకి, పాలరేకి, నరాలరేకి, నల్లముట్టిరేకి, పులునురేకి, కాకిరేకి, యింకా యెన్నో కుప్పతిప్పలుగా దొరికాయోసి. ఆయేలమా మంచి చకునం.

అయి—ఓరి యీమాతరిన కేంటారి చంతోచం. మొన్నపోయి చోమారంప్రొద్దున్న యెన్నియెన్నిరా బాబు! సెప్ప ఆచ్చెరరె ఆతాడిపిను.

కొమ్మిరాయి, దుడ్డుకొమ్మిరాయి, నేతికొమ్మిరాయి, పాలకురాయి, ముళ్ళాకురాయి, అంతికాయి, కండబాయి, కాళ్ళకంకడబాయి, యింగలాయి, [illegible]ంగిలాయి, బొంబిడాయి, మేదరాయి, మసురు, కదుసు, యిలస, పులస, మట్టగిడస, తోకపరిగ, ఏలికపరిగ, తెల్లాము, యాలాము, మాగ, బుడంమాగ, సందువా, [illegible]చందువా, కచ్చిల, కలిమి, గొరక, కోయింగ, గంటుమేను, కొర్రమేను, చీరమేను, కాటుమేను, పండుచేప, వెండిచేప, యిసకదొంతి, బుగ్గదొంతి, వాలిగ, వాల, సావిడం, కుక్కవాల్క, మాత, కడిం, పార, రావ, చీంబోత్తు, తెల్లపొట్టయేట, వంజరం, తూర, యివి రకానకి ఎయ్యితక్కువలేవు గందా. చెప్పు నాకు నాకే యద్భుతంరా.

రెండ—ఓ[illegible] తస్సాగొయ్యా నీ డబక్కులకేమి. ఓడ చేయుదరిం మయానకొచ్చింది. వల వరండొస్స.

అయి—వరండొసి. వరండొసి. (అని వల వేయుచున్నారు.)

(అందరు వలలాగుచు) ఏలా జేలా మలేసా

హైలేసా వాలా యేలేసా

హైసా హైసా హైలేసా

చేసూ భాను హైలేసా.

మూఁడ—మొదటేతకే వల యీలాసిక్కిందేరా!

నాల్గ—మనపోట్లాటకు దెచ్చినఫలం కాబోలు.

మొద—దిగంటోసి.

రెఁడ—నీవే దిగరాడోసి.

మూడ—నీవోసి.

నాల్గ—నీవోసి.

అయి—పక్షికులాన్న బుట్టలేదంటాౕ, యింతభయ మేల.

(అని దిగి తడుముచు)

వసంతకోకిల. అరేయరేయరేయిదేటో ♦ యాచ్చరంబుగా
కరంబునందుజొస్సెపద్ద ♦ గండునేపగా
బిరావరందురోసినాకు ♦ భీతిబుట్టురో
బరాబరీగయెత్తిపార ♦ నైత మొద్దుపై.

మూడ—(దిగి తడుముచు)

షట్పదము. ఏరనీవుపల్కులాను ♦ లెంతో యద్భుతంబురా
భారమంటు భయముయంటు ♦ పద్దబొబ్బలెట్టితా
తేరయింత వగసపుట్ట ♦ లేదెపక్షియానికి
ట్లోరిసిబ్బి తెవరువిన్న ♦ యొద్దుపైకినెత్తరా.

(అని యొద్దుపైనఁబడవైచి వలతాౕళ్ళు విప్పుచున్నారు)

మొద—ఓసీ ఘనుంసేపెమేరా!

రెండ—సాల్లే ఘనుంకాదోసి. ఘనుమైతె యెనుంలాగే వుటింది.

మూడ—తిమిరా.

నాల్గు—తిమికాదురా సీతమినే ఆలాగనుకుంటున్నావు.

అయి—రావణహస్తమోసి.

మొద—రావణహస్తమా నీకు సేదస్తమా?

(అని వలవిప్పుచున్నారు.)

రెండ—సుగంధి, ఏళ్ళుఘోర ర్యొంతభార ♦ ఘంతకాంతియుండెరా



మూడ— సేపగాదు పీపగాదు ♦ సేడియేమొ సూడరా

నాల్గ— పీపగాదు జెల్లగాదు ♦ పీనుగేమొ చూడరా

మూడ— యాపిరాడుసుండెసూడు ♦ యువ్వాదంసత్తురా. 6

[అని వలతాౕళ్ళు విప్పఁగనే సుశీలలేచి కూర్చుండి]

హా ప్రభాకర మహారాజరాజా! హా జయచంద్రా! హా చంద్రరేఖా! అను చున్నది.)

అయి—అరే! దయ్యమోసి (అని పారిపోవుచున్నాఁడు)

తక్కినవారలు—అరేపిశాసమోసి. కామురా కాళిణుయేమో!

కాదసిపద్దశక్తి. కాదాసి మన్నిమింగడానికి వచ్చిన రాక్షసిరా.

(అని యొకరినొకరు గెంటుకొనుచు పారిపోవుచు న్నారు.)

సుశీ—ఆహా! యిదెయేదేశము. వీరలెవరు? (విచారముతో)

కవిరాజరంజనీ. ప్రభాకరా! ప్రభాకరా ప్రభాకరాన్వయా
సుభూషణా, సుభాషణా ♦ సుభూషితప్రభో
నిభావభాప్రభాసుభా ♦ న్వితాసభాకభా
విభూతిభూతిభూధరా ♦ విభావరీనిభా. 7

ఆహా! అమ్మహానుభావుని వర్ణింప సహస్రవక్త్రునికైనా యలవి కాదు. నాకు శక్యమా?

తే. గీ. వసుధనభములు నేలుప్ర ♦ భాకరుండు
వరగుణ దయాపరుండు ప్ర ♦ భాకరుండు
పాపవనదహనుండు ప్ర ♦ భాకరుండు
అట్టి మహనీయునిడనాడి ♦ యెట్టులుందు. 8

అయ్యయో! పతివియోగమే గాక కడుపుచిచ్చున కేమందును.

ఉ. సంతతిగల్గగాకులము ♦ సంపదరాజ్యము బెంపునంచునే
సంతసమొందితిన్ విధివ ♦ శంబిటులుండ మదీయకోరకుల్
సాంతము గాఫలించునెయ ♦ సత్యయభాగ్యపు హీనురాలనా
కంతటిభాగ్యమబ్బునెద ♦ యాపరసాధ్వికిఁ గాక భూస్థలిన్. 8

ఓకూనలారా!

తే. గీ. నాదుపొత్తిళ్ళయందున ♦ బోరిదిఁజేసి
దుడుకు కానన ఘుందున ♦ దుంచ మిమ్ము.

బట్టికొనిపోవ గనుచున్న ♦ పాపినేను

తల్లినేమీకు మృత్యువ ♦ యిల్లుగాక 10

కటకటా! యేమందు.

చ. ఖరఖరదీప్తి తేజుడగు ♦ కాంతునిచావున కైనగుందనా

వరగుణ శ్రేష్ఠులయినపసి ♦ పాపలమిత్తికి దుఃఖమొందనా

చెరచెరులైన జాలరుల ♦ చేతికిజిక్కితి నేడు పొక్కనా

హరహర! యేమి నాబ్రతుకు ♦ సోదరమయ్యో! విచారమయ్యెడున్. 11

అకటా! నా యార్తారవము వినువారెవ్వరు. ఓ మహారాజా! నీయనంగు పుత్ర పుత్రికలతో స్వర్గంబున సుఖంబుగా కాలము పుచ్చుచుంటివా. నేను పాపాత్మురాల నా! మీచెంత చేరుట కావంతైనను నోచుకొని యుండలేదా? (అని నలుదెసలం జూచి) ఓ జాలరులారా! నన్నేల బయిటకు దీసితిరి. తిరుగ నన్నెప్పటిచోటుననుంచి వేయుడు.

[జాలరివాండ్లు ప్రవేశించుచున్నారు]

మొద—(తోడివారితో) అరే దయ్యముగాదోసి పిశాచముగాదోసి మంచి అచ్చరదైన స్త్రీరా.

[అందరునా మెచుట్టు తిరుగుచు చప్పట్లువేయుచు]

హ య ప్రి చా ర ర గ డ.

| | |
|---|---|
| రెండ— | మందయాన ♦ యందమోసి |
| మూడ— | యిందిరైన ♦ యందజేసి |
| నాల్గ— | మొగముకల్వ ♦ బోలునోసి |
| అయి— | మగువమించి ♦ మానసోసి |
| మొద— | గళముధన్ను ♦ కంబునోసి |
| రెండ— | బాలరూపు ♦ పచిడిరోసి |
| మూడ— | దీనిజాడ ♦ గానెనోసి |
| నాల్గ— | కనులుపండు ♦ గాయెనోసి |
| అయి— | దీనిబెండి ♦ నేనుయాడ్త |

[ఒకరినొకరు గెంటుకొనుచు]

| | |
|---|---|
| మొద— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త |
| రెండ— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త |
| మూడ— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త |



| | |
|---|---|
| నాల్గ— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త |
| అయి— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త |
| మొద— | నేనెయాడ్త ♦ నేనెయాడ్త 12 |

[అని అందరి తరిమివేయుచున్నాడు]

తక్కినవారు—నీవూళ్ళోకిరారోసి. నీపనిచెపుతాం.

[అని నిష్క్రమించుచున్నారు.]

మొద—(సుశీలతో)

విచిత్రవృత్తము. నినుంబెండిలాడన్ ♦ మనంబందుబుట్టెన్

ఘనంబొప్పునన్నీ ♦ చ్చనంబేలుకొమ్మి. 13

సుశీ—(స్వగతము) దైవమా! దుష్టులని బాధకోర్వలేక సంద్రంబునం జొచ్చినను నీ కూరరులచేతిలోం జిక్కజేసితివా. ఇప్పుడీ దుర్మార్గుడేమిచేయునోగదా! చావందలంచితి. ఇంక నాకు భయమేమి? (ప్రకాశముగా) ఓరీ నన్నేలపయికి దీసితివి? ఎప్పట్టులజలరాసిలోం బారవేయుము. మాయట్టి రాజపత్నీపతివ్రతాశిఖామణుల నిట్టిదుర్భాషలాడవచ్చునా? పాపముచుట్టుకొనదా?

మొద—సేనసేన. రాజాపత్నులైతేమాతేం! మేసాపత్నులైతేమాతేం! నేనుతప్పక పెండ్లాడిదల్చాను.

సుశీ—ఛీఛీ నోరుమూయుము. ఇట్టికాఱులవకుము.

మొద—ఆ ఆ ఆ. అలాగా (అని ఆమెచెయి బట్టుకొని లేవలెత్తి)

ద్విగ్విణి. ఇట్టియామాటలతేం ♦ యెన్నోనోసూసితిఁ

జుట్టుపట్టావారు ♦ జూచియేంసేతురో

గట్టిగాకొట్టులో ♦ గట్టిపారేసినం

జెట్టపట్టేనసుం ♦ సెప్పినట్టేందువో.

(అని యామెను గొట్టులోం బడనైచి తాళము వైచి తలుపుపైదట్టుచు)

అ—విభూతి. నోరికోస్సినట్టులం ♦ సీరిమాటలాడకఁ

నోరుమూసుకూరకో ♦ నారికేసిపేతుగా. 15

(అని నిష్క్రమించుచున్నాడు)

(ఒకప్రక్కనుండి పల్లివానిభార్య గంపచేతబట్టుకొని ప్రవేశించుచున్నది.)

(రెండవప్రక్కనుండి మరియొక పల్లివానిభార్య ప్రవేశించుచున్నది.)

మొద-భా—వొదినా యెక్కడనుంచొస్తున్నా.

రెండ-భా—మాయన్నకేదో అచ్చరమైన స్త్రీ దొరికిందని మీయన్న చెప్పితే చూడానికి కొచ్చానో.

మొద-భా—యీగొట్టులోపడేసి తాళంవేచాడు.

రెం-భా—యేదీతీయి యెంత చుందరంగావుందోచూతాం.

మొద-భా—(గంపవచ్చటదించి తాళముఁ దీయుచున్నది.)

(సుశీల నివతలకు వచ్చుచున్నది. వారలు పివ్వేరపాటుతో చూచుచున్నారు)

మొద-భా—ఇచ్చటుండక మరియేచోటికైన్నాపో. నా మగడు మంచావుకాడు. ఆడికినాకు పోట్లాటతెచ్చి సాకాపరం గంగలో దించినదాన వవుతావు.

(అని గంపతో సుశీలను గెంటుకొనిపోవుచున్నది.)

(రెండవపల్లీవానిభార్య ధ్యానిపెక్క నిష్క్రమించుచున్నది.)

తే. గీ. ధాత్రి నేలకంట్యోఘ సుం ♦ దరశివాఖ్య
భావనారాయణులప్రియ ♦ మఱఁదిరైన
యల్లఘు మఖివి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత. 16





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖావిజయము.

## పంచమాంకము.

ప్రదేశము. అరణ్యము, కాళికాలయము.

[చంద్రరేఖయును, బోయివాఁడును, బ్రవేశించుచున్నారు.]

చంద్ర—ఓయీ! నన్నికాళికాలయమున కేలదెచ్చితివి?

బోయి—తే. గీ. సంతుకొఱకు నరబలి ♦ యొసంగి రేని
గలుగునటయందు రెల్లరు ♦ పలుకుచుంద్రు
గాన నిన్నిప్పు డీకాళి ♦ కకును భక్తి
బలియొసంగెద సంతాన ♦ పదవికొఱకు. 1

చంద్ర—(గడగడఁ వడఁకుచు విచారముతో మనసులో) మహారాజరాజమహేంద్రుండలుండును, బుధసుతకీర్తి మంతుఁడును, నగ ప్రభాకరు సకును, మహాపతివ్రతాశిఖామణియని పేరొందిన సుశీలకును, ముద్దుకూఁతునై మహాపరాక్రమశాలియగు జయచంద్రునకనుంగుచెల్లెలనై నేఁడుదిక్కు లేక యిక్కాననంబున నొక్కఁ ముక్కడివానిచేఁ జావు సిద్ధించుచున్నదిగదా. హాదైవమా! యిమ్మరణ బనియేమి? మాయన్నగారు చెప్పినచొప్పున విధాతవ్రాఁత దాటఁదరము గాదు గదా? అయినను నొక్క మాట చెప్పెద. (అనిప్రకాశముగా)

తే. గీ. నీదు మేలుకొఱకు ♦ నితరుల బలినిడ
కాళియేలకోర్కె ♦ చౌరినిడును
యక్కఱలదిటుల ♦ క్రొమొక్కు దీర్చుటె గాని
ఫలమదెల్ల కలుగు ♦ పరికి నీకు, 2

అదియునుంగాక,

ఉ. వారకఁబోరుచువాఁడవని ♦ వచ్చితినమ్మిట నీదువెంటన
న్నారకఁజంప నెంచితివి ♦ యొప్పునె? నీమదికింత సాహసం
బారసిజూడఁగా నజము ♦ మర్త్యుని బాయక తోడునీడగా
కూరిమితోడ త్రిప్పనతి ♦ క్రూరముతోఁబలి యిచ్చుటేకదా. 3

ఏల? నాయందు దయమాలి మడియింప నెంచెదవు. నామాట లాలించి నీయింటఁ బెంపుము. ముందుసంతతి యొనఁగూడుట పట్టిదిగాని మొనగూడుట ముఖ్యము.

బోయి—తే. గీ. పూర్వకాలము నన్మనఁ ♦ బూర్వులబల
వరములనుఁ బొందఁగా నెంచి ♦ వరమతుబయి
మహిషములు కుక్కుటమ్ములు ♦ మనుజులాది
బలియొసంగినటించుము ♦ బల్కినవొ. 4

పాపమున్నచో నటులఁ జేయుదురా. నీని మన్నిటికన్నను నరబలి ముఖ్యము. దాని నొసంగఁగా నేతత్సమే దేవి పరితృప్తయై కోరిన కోర్కెలు కొఱంతలేకుండ నిడును. కావున నాలస్యముఁ జేయరాదు. శిరస్సువంచి నమస్కరింపుము.

చంద్ర—(విచారముతో)
రుగ్మతీ. ఆరఘుభూషా ♦ యాశ్రితపోషా
నేరములేకన్ ♦ నేడిటజంపన్
గోరుచుండెన్ ♦ క్రూరుడునన్నున్
భాగమునీదే ♦ బాగుగబ్రోవన్. 5

(కోపముతో) నీవసలే కిరాతవంశజుఁడవు అందులో గొడ్డువాఁడవు. నీకు మంచిచెష్టలుదెలియు టెట్లు? నే నిదివరలో నెవరికిని మ్రొక్కియుండలేదు. మ్రొక్కెడు పద్ధతిం గనపర్చుము.

బోయి—పాపము మ్రొక్కింపెదఁజూడుము(అనికత్తిగిరగిరం ద్రిప్పుచున్నాఁడు.)
చంద్ర—(గడగడవడంకుచు కన్నీరునింపుచున్నది)
(తెరలో) ఓరీ! నా పేరు సుశీలుండని యెఱుంగవా?

[అని సుశీలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఉత్సాహ. ఘోరకాననంబునందు ♦ క్రూరమతిని బాలిక
న్నేరమేమి లేక యెటుల ♦ నేఁడు చంపనెంచితో
చీరివైతు వాడలు రెండు ♦ చెక్కలుగను నిప్పుడే
పోర (అని గుండెలపైఁజేయవేసి గెంటి)
దిక్కుకల్గియున్నఁ ♦ బోయిచెప్పుకోవలెన్. 6



బో—(కోపముతో) ఉత్సా. ఇటుల దంభములనుబల్క ♦ నిప్పుడే నినుస్వెసక్
చిటికెలోన ద్రుంచివైచి ♦ చిన్నికన్నెఁబిమ్మటన్
తటుకున న్శిరంబుఁ గోసి ♦ ధన్యకాళికీయ నీ
వెటులఁ బోదువెందుజొత్తు ♦ వేమిసేతు చూతురా.

[అని సుశీలునిమీదికరగుచు]

బోయి—పంచ. శిరఁబుడంబువీఱునేఁడు ♦ కత్తిమీద కత్తితో
సుశీ— శిరంబుఁగోయకున్న నిష్ఠ ♦ ఛీయటంచుఁ బిల్వరా
బోయి— పరాక్రమీవపల్కుటేలఁ ♦ బట్టుపట్టు వేగమే

[అని యిద్దరుఁ గలియ బడుచున్నారు]

(సుశీలుఁడు బోయిని పడవైచి మీఁద కూర్చుని కత్తిపైకెత్తి)
దురాత్మ చావుచావు ♦ దుడుకులన్నివీడుచుక్.

[అని పాడుచు చున్నాఁడు]

చంద్ర—ఆర్యా! నాపుణ్యవశంబున మీరడ్డుపడుటచే నాకు మారుగా నీకిరాతుఁడుపరలోకగతుఁడయినాఁడు.

సుశీ—(పైకిలేచి బట్టసవరించుకొనుచు) అమ్మా! నీకిఁక భయములేదు. (అని నిలువఁబడి) నీవు రాజకుమార్తెవలెఁ గాన్పించుటయే కాక నాకు ప్రియబంధువర్గములోని దానివలెఁ గన్పట్టుచున్నావు.

ఉ. ఎక్కడఁకన్నెవీవుకుల ♦ మెయ్యది నీతలిదండ్రు లెవ్వరో
యక్కటయొంటిగా గహన ♦ మందుఁజరించుట కేమిబోయెహాఁ
డెక్కడ నీకుఁదారసిలె ♦ నిచ్చటఁ జంపఁ దలంచు టాదిగా
నిక్కమెఱుంగఁదెల్పు మిఁక ♦ నీరజనేత్ర శుభంబు చేకురున్. 9

చంద్ర—ఆర్యా! నా పేరు చంద్రరేఖయందురు.
సుశీ—(మదిలో) ఆహా! రూపునకుఁ దగిన పేరే.
చంద్ర—నా తండ్రిరత్నగిరి దేశాధీశుండైన ప్రభాకరుండు.
సుశీ—నీజనకుఁడు ప్రభాకరుఁడేనా? అటులయిన తర్వాత, తరువాత.
చంద్ర—నా జననిసుశీల నా (—)
సుశీ—(ఆమెను కౌగలించుకొని) నాతోబుట్టకూతువే! నాముద్దుల మేనగోడలవు(అని యామెను ముద్దుబెట్టుకొని) ఏదితరువాత తరువాత.
చంద్ర—అన్నయ జయచంద్రుఁడు (అనియేడ్చుచున్నది)

సుశీ—ఉ. అమ్మ! విచారమేలవిను ♦ హాయిగనీస్వజనంబుచెంతనే
ఘర్మమ్ముగనిండఁజేయుటకు ♦ కన్నియనాదికభారమమ్మమీ
యమ్మయె మత్సహోదరియు ♦ నాను ప్రభాకర రాజ భూప యే
నమ్మతదీయభార్యయగు ♦ నా జయచంద్రుఁడుభాగినేయుఁడీ
వమ్మరొ భాగినేయి విఁక ♦ నంజకలేటికిదుఃఖమేలికన్. 10

చంద్ర—(స్వగతమున) ఇంచుగ హెచ్చుతగ్గగా మాయమ్మను బోలి యున్నవాఁడు. ఒకవేళ బోయవలె మోసము జేయఁ దలఁచినవాఁడేమో. (ప్రకాశముగా) నీవు మా మేనమామ వయినపక్షమున మాజననికిఁగల రూపలావణ్యాదుల దెల్పుము.

సుశీ—సరే మంచిది.

సీ. భూరిమధ్యమందున ♦ బొట్టురీతిగనుండు, పుట్టుమచ్చయు లేదు ♦ పుణ్యసతికి
నగినచోఁ జెక్కిళ్ల ♦ సొగసుగా గుంటలై, నిగనిగలాడవే ♦ మగువ కెపుడు
కుసుమమాలికరీతిఁ గొమరుగా గళమున, మూఁడు రేఖలు లేవె ♦ ముదితకరయ
చికురముల్ క్రేలాడు చెన్నుదలంపంగ, మడమలునంటవే ♦ మానినికిని
తే. గీ. చారురుచినొప్పు చామన ♦ చాయమేను, వయసు ముప్పదిరెండేండ్ల ♦ వరకునుండు
పొడవుఁ బొట్టియుఁ గాక న♦న్నోవలియుండు, బాలగుణజాల ఘనలీల ♦ వరసుశీల. 11

అనిగాక మీమాతయు నేను గవలలమగుటచే మాకిరువురకు నొక్కపేరే యిడినారు.

చంద్ర—(ఆశ్చర్యమును విచారమును మనంబునం బెనంగొన) ఆహా! "పుణ్యవశము చిన్నదయినచోఁ నరణ్యమునందైనను జుట్టములలవడుదుర" నుమాట నిజముకదా. (ప్రకాశముగా) మామా! ఏమని చెప్పుదు. నాతండ్రిని గూర్చియుండెడు దుశ్శీలుండు నిద్దురలోఁ జంపె.

సుశీ—(ఆశ్చర్యముతో) దుశ్శీలుఁడాతని పినతండ్రి కొమారుఁడెగదా! అటుల గావింప జేయుటలాడెను.

చంద్ర—అతఁడుఁ పరదారాభిలాష హెచ్చుగలవాఁడై యాయారివారలం బాధింప మాజనకుం డందులకలఁగి వానిని కారాగృహబద్ధునిగా జేయ భటుల కాజ్ఞయొసంగెను. ఈ వృత్తాంత మాతఁడు తెల్లంబుగా నెఱింగ నాటిరేయి మందిరముం జొచ్చి యందు నిదురించుచున్న మాతండ్రినిం జంపి మాతల్లిం జెప్పట్ట నుంకించె.



సుశీ—(కోపముతో)

శా. ఏమేమీ వెఱపింతలేక నెదజే ♦ యట్లాడె దుర్మార్గుఁడీ
కామక్రోధమదాంధకార తులువా ♦ గర్వాతిరేకాకృతా
యీమర్త్యాశుపదంబునం బెఱిఁగియా ♦ న్యాయంబుగా దుర్నిపుటల్
పాముల్ బెంచగ కాళ్ళపీకుకరణి ♦ న్పాపాత్మనీకృత్యముల్. 12

కానిమ్ము. దుష్టా! నీరోజు దగ్గరకు వచ్చినది. నేనిప్పు డెన్నికేకలు వేసినను లాభమేమి? కంఠశోషే గాని. అటుపైని యామెదుస్థితియేమయ్యె.

చంద్ర—ఏడువనారంభించెను. మాయన్న యదిచూచి క్రిన్ననఁ బాన్పునుండి డిగ్గి ఖడ్గము నూని వానిఁ జంప యత్నింప వాఁడదెఱింగి మమ్ముల నిద్దరిని గానవమందు దెగటార్పుఁడని తలవర్లకొసంగెను. అందులకు మాజనని కడుగుంది జలరాసిలోఁ జొచ్చెను.

సుశీ—(విచారముతో)

సీ. మిన్నొక్కపెట్టున ♦ మీదపడ్డనుగాని, ధైర్యంబువిడనియు ♦ దారమతులు
లేని నేరముపన్ని ♦ మానవాధము లెల్ల, దూషింపరోషంబు ♦ దొరనిబుధులు
కలిమిగలదనుచు ♦ గర్వించిపరజలకు, హాదిజేయనియట్టి ♦ మానఘనులు
బలవంతముగతమ్ము ♦ పైబడిమోదిన, కినుక చెందని యట్టి ♦ కీర్తిధనులు
తే. గీ. కటకటా యెంచనొకచిల్లి ♦ గవ్వకైన, మారకుండెడుదుష్టుచే ♦ మాన్యవరుల
కెట్టియాపదఘటియిల్లె ♦ నేమనందు, కనఁగచిన్నచిల్లికోడ ♦ మునిగినటుల.

ఇప్పుడు నేవిచారించ లాభమేమి? మీయన్నయేమయ్యె.

చంద్ర—మమ్మునుజంప యత్నించిన తలారి దైవికముచేఁ దనకత్తి తన కుత్తుకకేఁ దగులమృతినొందెను. అంతటఁ గాంతారంబున మేమిరువురమును చరించుచుండ నే మూర్ఛనొందితిని. మాయన్న యెటకుబోయెనో, ఈబోయ మీయన్నను జూపెద నని మాయోపాయము పన్ని సన్నికాళికకు బలియిచ్చుటకుఁ దెచ్చెను. మీరడ్డుపడితిరి.

సుశీ—(కోపముతో) ఔరా దుశ్శీలా! దుర్గుణగణ జనపాలా! క్రూరా! చండాల

చ. ఎఱుఁగవొ నాభుజాబలము ♦ నేటను మున్గిన నేడు కేగినం
బరుగిడిమూఁడుమూతులను ♦ బ్రాపుగఁజేకొని నిల్చియుండినన్.

ధరమున నిన్నుబట్టి తల ♦ ద్రుంచకయుండిన నాదుపౌరుషం
బరయఁగఁ గాల్పనే యువతులు ♦ బాయనె మీస మిదేలకాల్పనే. 14

(అని ఆమెతో) అమ్మా! పోదము. మీయన్న నగరి యాదురాత్ముని, మద మడఁతము.

(అని యామెచేతిని బట్టుకొని యిద్దరు నిష్క్రమించుచున్నారు)

తే. గీ. అవని నయినాపురపు బాప ♦ నార్యసుతుఁడు
నీలకంఠి సుందరరామ ♦ [illegible]
డైన సుకవి సుందరరాము ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత. 15





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## షష్ఠాంకము.

ప్రదేశము — విగుర్లాకోట.

జయ—(కోటను కొంతదూరమునుండి చూచి) ఆహా! దారితప్పి యిటవచ్చితిని. ఇదియెద్దియో. మహారాజపురమువలె నున్నది.

[విచారముతో]

నలసగతివృత్తము. చెలియలను గానము ♦ చెంతఁబడి నేనున్
సలిలముల కేగినది ♦ జాడఁగనలేకన్
కలఁతమది జెంది యతి ♦ కష్టములపాలై
సలలితపుప్రియుదరి ♦ సాలమునుగంటిన్. 1

ఆహా! నా ముద్దుచెల్లెలను

కవిరాజవిరాజితము.

మదగజయానను ♦ మంజులభాషిణి ♦ మానధనాగ్రిణి ♦ మానినినిన్
వదనసరోజను ♦ పంకజనేత్రిను ♦ భవ్యసుకీర్తిని ♦ బాలను నే
వదలితిగండక ♦ వ్యాఘ్రమృగేంద్రకి ♦ వాళివరాహము ♦ వంగతలిన్
మునమునఁ గావలె ♦ ముగ్ధలసోదరి ♦ మోహనరూపుఁడ ♦ మోదకనా. 2

ఆహా! ఉ. పోదమటన్న దారిఁగని ♦ పోల్చఁగఁజాలనిఁ కేమిచేతు నే
మాదిరిఁగాంచువాఁడవన ♦ మధ్యమునందున నేరుదిక్కుహా
సోదరబుద్ధిపీడుమను ♦ జన్యునఁ జేరితి నిట్టిచోట నా
గాదిలిచెల్లెలేమగనొ ♦ కష్టపడెనైతినిగాదె దైవమా 3

అన్నన్నా ! ఇప్పుడు నేఁజేయవలసిన దేమి,

సీ. చెలియలనీమార్గ ♦ దెలుపఁగ నే నెంచి, వారిక్కైయే తెంచి ♦ దారితప్పి
వచ్చితిక్కిచ్చోట ♦ వనమున నేమైతొ, మూర్ఛితమృగావళి ♦ మ్రుక్కఁబడితొ
గ్రాహంబుచేసను ♦ త్యాగంబుచేసితొ, బందెగాండ్రచేత ♦ పట్టుపడితొ
తెరవొందినాకయి ♦ విలపించుచుంటివొ, యటవిమధ్యంబున ♦ నడలుచుంటొ

తే. గీ. అకటవస్తువుఁజేసేత ♦ నబ్ధియందు,విసిరివైచినభంగిని ♦ న్వేపినముందు
విడచివచ్చితి నావంటి ♦ వెడఁగుగలఁడె, నేమి సేయుదు నేమందు ♦ నెంతుఁజొత్తు. 3

(అని కొంచెము ధైర్యము దెచ్చుకొని) ఇఁక మించినదానికి చింతించిన లాభమేమున్నది ? కావలఁచిన పనికాకపోవను. (కోటనుఁ గొంచెము దూరమునకేగి నవ్వుచు ముఖముతో) ఇయ్యది చూచెదగాక నేను.

సీ. సమసినజనకుని ♦ సంప దబ్బినయట్లు,కపటిఁజొచ్చినతట్లఁ ♦ గాంచినట్లు
దుర్గామునవిడిన ♦ తోబుట్టు గనినట్లు,దుష్టదుష్టులుని ♦ దునిమినట్లు
నాగుసదివులతో ♦ నగర మేలినయట్లు,యన్య దేశపురాజ్య ♦ మబ్బినట్లు
నీతిమంతులచేత ♦ ఖ్యాతిబొందినయట్లు,కష్టచయము ♦ నేటఁగలసి నట్లు

తే. గీ. తోఁచుచున్నది యీసాల ♦ గాంచగానె,సత్కృతమునిన్నదైనచో ♦నస్ఫలవగాడ
ననితలంపుమున్నమ ♦ తాఁజ్యాధిపతులు,దుఃఖముఁగొందిరాజ్యమ్ము♦దొపరలేదు.

కావున వారుగూడ నిట్టియిక్కట్టులువదలి సుఖమునొందు రోజులుదాపయినవని తలంచెద (కొంచము దూరమరిగి) ఏమి ? నామూఢత్వము.

తే. గీ. పుట్టుకేగుడ్డియట్టునైన ♦ మూఁగయూను
యినిబధిరుండటగాకర ♦ రిద్రుఁడెంచ
కుంటియెన్నఁగ కుష్ఠుడౌ ♦ కోఁతికాఁడు
పృథ్వి నేకచక్రింబుగా ♦ నేలుటకును
తలఁచియత్నించుభంగి నా ♦ తెలివిదలఁప.

(కోటదగ్గఱకేగి) ఔరా! ఎంత విచిత్రముగనున్నది.

సీ. ప్రాకారప్రాకార ♦ ప్రాసాదములతీవి, యంబరవీధికి ♦ నంటియుండె
ఖాతమఖాతమై ♦ కల్లోలకూపార, కల్లోలముగ♦జుట్టు ♦ గదసియుండె
ధూళిధూసరములు ♦ హాళినభ్రౌసలను, శృంగిశృంగములన ♦ నెగసియుండె
గోపురగోపుర ♦ గోపురాకృతులుంగొ, చనములకును గోచరములయ్యె

తే. గీ. భళిర! విస్మయంబయ్యెనీ♦పరిధిఁజూడ, నహహపాలించునట్టియా ♦ యధిపుభాగ్య
ము మరగణుతింప నమరవిద్యాధరాహి, సిద్ధసాధ్యులకలవియే ♦ బుద్ధిదలఁప.



(అని దగ్గరకుఁబోయి) మాయురే ? ఇదియంతయు నాబ్రతుకువలెనే మాయగానున్నది. ఇది నిర్జనప్రదేశముగా నున్నయది. కాదు కాదు. నిర్జనప్రదేశమయినచో నంత శుచిగానుండు నా ? లోపల జనంబులుండవచ్చును.

ఉత్పలిక. ఘనుఁడుసజ్జన సన్నుతుండును ♦ ఘనజనావళి పరివృతుండును
శాతకుంభశరీరయుక్తుఁడు ♦ శాంతవక్త్రవిశాలనయనుఁడు
సుగుణపూజ్యుఁడునమిత తేజుఁడు ♦ విగతదూష్యుఁడుసత్యభాషుఁడు
నైనయానృపుఁజూడవేఁడెద ♦ నాదుదుఃఖముఁదెల్పఁగోరెద. 7

నాభాగ్యమెట్లుండెనోగదా. వామలోచనలకు వామలోచనంబును, పురుషులకు దక్షిణనయనంబును నదరినచో మేలుకలుగునందురు. ఇప్పుడు నాకు కుడి నేత్రింబదరుచున్నది. ఏమిలాభము కలుగునో!

(అని లోపలఁ బ్రవేశించుచున్నాఁడు.)

[అకోటనుండి మంత్రి, జయచంద్రుఁడు, ఇద్దరు భటులును, నలుగురు వారకాంతలును, కోటద్వారముయొక్క ముంగలకు వచ్చుచున్నారు.]

మంత్రి—ఆర్యా ! నేనీదేశాధీశుని మంత్రిని. నాపేరు మిత్రశర్మ.

అశ్వగతి. వంతులువాసెను బందులు ♦ వంశము దేశమునున్
సంతసమొప్పగ బాలుఁడ ♦ సాంతముగా మతి యీ
చెంతకు రాఁబనియేమొకొ ♦ శీఘ్రమె దెల్పుమిమా
కంతయుఁజూడఁగ మిమ్ములఁ ♦ గౌతుకమయ్యెఁగదా.

జయ—(మంత్రిదెసఁజూచి విచారముతో) సచివాగ్రణీ! నన్నేల దుఃఖవారాశిలోఁ బారవేసెదవు. నాబ్రతుకు నాసంగతి విన్నవారికేఁ గన్నవారిఁగూడ విచారము కలిగింపకపోదు.

కృత—ఆర్యా! తమకీవిచారమేల? సాధ్యమైనంతవఱకు తమదుఃఖనివారణమునకై ప్రయత్నించెదము. కావున నాతో కొంచెము సెలవిండు.

జయ—(విచారముతో)

ధ్రువకోకిల. ప్రణుతసజ్జనసన్నుతుండు ప్ర ♦ భాకరాఖ్యుఁడుదండ్రిమా
జనని భూనుత శీలచారు విశా ♦ ల నేత్రి సుశీలమా
యనుఁగుచెల్లెలు చంద్రరేఖను ♦ భాంగి రత్నపురంబునన్
జననమొందితి శ్రీమణీ జయ ♦ చంద్రుడన్ నృపపుత్రుడన్.

వారకాంత—(తోడివారితో) ఈతండు రూపలావణ్యములలోఁ జయచంద్రుని జయించినవాఁడే!

రెండ—అందువకే యీ పేరు వచ్చినది.

మూఁడ—నెచ్చెలులారా!

ఉ. కన్నుముఖంబు హస్తపద ♦ కాంతుల సంతతి కెంతయుఁ దగఁ
బన్నుగ నోటు జెంది జల ♦ మధ్యమునందునఁ జొచ్చెఁ బద్మ మ
న్నన్న విలాసమా సొబగు ♦ నౌర యొయారము జన్మమధ్యమం
దెన్నఁడు గాంచలేదిఁకను ♦ నెన్నఁడుఁ గన్గొన మిట్టిబాలునిఁ.

శ్రుత—మహారాజా! ఇటరాబనియేమి?

జయ—అమాత్యరత్నమా! ననుఁదిరుగ దుఃఖసముద్రములో ముంపదలంచితివా!

శ్రుత—బాలకా! అయ్యది నా యభిప్రాయముఁ గాదు. రత్నపురీశుండగు ప్రభా
కరుని గారాబుపట్టివయి చెప్పలేక పాదచారివై యిటువచ్చుటకుఁ గారణంబడిగితి.
అంతియేకాని మఱియెందులకు గాదు.

జయ—(విచారముతో) నాయవస్థ నేమి చెప్పుదు.

సీ. జనకుండు నడిరేయిఁ ♦ బినతండ్రిపుత్రుచే, స్వర్గస్థుఁడౌటకుఁ ♦ జాలఁగుంది
జననిప్రాణము బాయ ♦ జలధిలోఁ జొచ్చె, నన్ను నా చెల్లెల ♦ నలికనెంచి
తలవరి విడిచినమధ్య ♦ మునకుఁ గొనిపోవ, దైవయోగము చేతఁ ♦ దానెమడసి
ముద్దులతోఁబుట్టు ♦ మూర్ఛవోవఁగ నట, జలముల కొఱకునై ♦ కొలను చెంత
తే. గీ. కరుగ నెంచి యేగంగ మా ♦ గ్గంబుఁ దప్పి, యీ పురిని కోటదరిఁ జేర ♦ నృపుని జాడ
బుద్ధి యెడమంగ వచ్చితిఁ ♦ బుణ్యపురుష, యకట! చెలియ యేమయ్యెనో ♦ యటవియందు

(అని కన్నీరు నింపుచున్నాఁడు.)

శ్రుత—రాజా! యెట్టివారలకయినను గష్ట సుఖములు, కలిమిలేములు కలుగుచుండును
గదా. అందలి కలిమి సుఖములకు సంతసించి లేమి కష్టములకు విచారమొందరాదు.
రెంటిని సమానముగా జూడవలయును. అదిగాక,

తే. గీ. మున్న భాస్కరాన్వయమందు ♦ బుట్టినట్టి
యుర్విపతులెల్ల గష్టము ♦ లొందితుదకు
సౌఖ్యము లొందె యేలె రా ♦ జ్యమ్ము గాన
వారివలె నీవు సుఖములు ♦ వడయఁగలవు. 12

యిందులకయి యింతగుందనేల? ఇయ్యది మీ వంశ పరంపరా వచ్చుచున్నదియే కాన
నా కోర్కె నెరవేర్చితి రేని మీకష్టములు గట్టెక్కఁగలవు.

జయ—నాకలసయినచో శీఘ్రముగా నెఱవేర్చెద.



శ్రుత—(విచారముతో)

సీ. ఏసార్వభౌముని ♦ నెడయక చేపట్టె, కవితకన్యాతల్లి ♦ గల్పవల్లి
ఏసార్వభౌముని ♦ నెడయక చేఁబట్టె, సిరికిఁబట్టఁపుచేడి ♦ చిగురుఁబోఁడి
ఏసార్వభౌముని ♦ నెడయక చేఁబట్టె, ధైర్యసాహసరమా ♦ ధుర్యగరిమ
ఏసార్వభౌముని ♦ నెడయక చేఁబట్టె, దానగుణస్ఫూర్తిఁ ♦ ధర్మకీర్తిఁ
తే. గీ. యట్టివినుతమూర్తిఁ ననిలుఁ ♦ డలఘునృపుఁడు, దైవగతి చేత మతిలేక ♦ దనదు రాజ్య
మంతవిడనాడి కాంతార ♦ మధ్యమందు, దిరుగఁ జొచ్చెను విధి వ్రాఁతఁ ♦ ద్రిప్పవశమె.

కావున నమ్మహానుభావుని రాజ్యలక్ష్మికి మేమేర్పరచుకొన్న కాలనిర్ణయప్రకార
మెవ్వరయిన నీద్వారములోఁ బ్రవేశించినచో రాజ్యపట్టాభిషిక్తునిఁగాఁ జేయ
నెంచితిమి.

జయ—(ముఖవికాసముఁ జేయుచున్నాఁడు).

[పరిచారకుఁడు లోననుండి కిరీటమును దీసికొనివచ్చి మంత్రి కిచ్చుచున్నాఁడు.]

శ్రుత— మయూరరుతము. శ్రీపతికృపచేన్ మాభాగ్యమునన్
చింతలబాపన్ జేరితిరిటకున్॥ శ్రీపతి॥
భూపకులాగ్రణి రసనరసాగ్రిణి
భూపుణ్యాగ్రిణి బుధలోలాగ్రిణి॥ శ్రీపతి॥
మాపయిభారం మాకు విచారం
మాకిఁక లేదే మీదే కాదే॥ శ్రీపతి॥
నృపవరశీలా రాజ్యమిదేవేళ
యిచ్చితిబాలా యేలుకో లీలన్॥ శ్రీపతి॥ 14

[అని కిరీటము శిరముపైనిడ బోవుచున్నాఁడు]

వారకాంత—(తనతోడివారితో) అహో!

తే. గీ. డంబుగా నీనృపునకుఁ బ ♦ ట్టంబుఁ గనిడుట
దిక్కులకు జని కాంతిని ♦ ధిక్కరించి
విరియఁబారి చూపరులకుఁ ♦ బ్రీతినిడెడి
పూవులకుఁ దావి యొనగూడు ♦ పోల్కి గాదె. 15

రెండ—చాలుచాలు. ఇదియేనా నీసరసోక్తి వారకాంతలింక నెంతయో వింతగమాట
లాడుదురని సరసులనుకొను పలుకులు వృథాజేసితివి. ఇదివినుము.

తే. గీ. రాజ్యలక్ష్మిని బొందుట ♦ రాజసుతుడు
సకలసౌభాగ్యసంపద ♦ సౌఖ్య మిడుచు

నెల్లరను దల్లిరీతి ర ♦ క్షించునట్టి

యిరదిరను బొందు సాఘిష్ణు ♦ చంద మబల. 16

మూడు—(రెండవవారకాంత నైపుచూచి -బుగ్గలుపొడచుచు) చాలుచాలు నీద్వ్యర్ధి కేఁజాలసంతసించినాను.

శాల్గ—ఓహో! రాజ్యలక్ష్మియనుమాట నీనామమునకును రాజ్యమునకును సార్థద్వయము కలిగియుండుటచేతనా,

రెండ—ఎవరనుకున్నకోరిక వారిని బయలుపుచ్చకమానదు గదా.

జయ—తే. గీ. నాకుపట్టాభిషేకంబు ♦ వీకతోడ

చేతునంచును దెగువతోఁ ♦ జెప్పుమాట

“మంగళికిపరిధానత్వమె ♦ సంగినట్టు”

లనెడునార్యోక్తిగదసచి ♦ వాగ్రిగణ్య! 17

శ్రుత—ఈరీతిని సెలవిచ్చుట మీవంటి బుధాగ్రేసరులకు ధర్మమే నా? మీరు రాజ్యపరిపాలనకర్తలుగనుకనే మే మేర్పఱచుకొన్న కాలనిర్ణయములో నీప్రాకార ద్వారముగుండ దైవము మిమ్ములఁ బనిచినాడు.

అన్నియునుంగాక. తే. గీ. ఆదిశేషువు శిరముపై ♦ నవనితలము

మోయువలె నున్న ఫణులెల్ల ♦ మోయఁగలవె

యట్టులె భూభరంబును నెప్డు ♦ యాధిపశ్రేష్ఠు

లేలవలె నున్న నరవరు ♦ లేలఁగలరె. 18

(అని కిరీటము శిరముపైనిడి మంత్రి కూర్చుండినాడు)

వారకాంతలు—జే జయచంద్రమహారాజా!

పంచచామరము, ముక్తపదగ్రస్తము.

సురేంద్రవైభవా బుధాళి ♦ స్తోత్రపాత్రభూవరా

వరా యశోవిహార ధీర ♦ వైరిసంహారా హరా

హారప్రపూర్ణపూర్ణచంద్ర ♦ హంసవంశభాసురా

సురాహితుల్యగాత్రనాయ ♦ శోభనానుభాషణా 19

తోటకవృత్తము. జయచంద్రునకున్ గుణ ♦ సాంద్రునకున్

భయహీనునకున్ జయ ♦ మంగళమో

నయవిద్యునకున్ జన ♦ నాథునకుం

బధుకారునకున్ శుభ ♦ మంగళమో. 20



(అని మీఁదపుష్పములుజల్లి నృత్యమును జేయుచున్నారు.)

జయ—వహ్వా! బాగుగనున్నది.

ఉ. సుందరులార! మీరగువ ♦ చోర చనాకృతి వీణనాదముల్

పొందగ నాటపాటలయి ♦ పొల్పెసలారెడు జావళీల్ కృతుల్

మందర మెచ్చు మీనటన ♦ మద్భుతమున్ గనుఁగొలున్ బలే

నందము పొందుచున్నదివి ♦ నంగనె దుఃఖము బాసినామదిన్. 21

వారాంగనలారా! నృత్యముచాలు.

శ్రుత—రాజుగారియొద్ద సెలవుఁ దీసికొని మీమీమందిరములకుం జనుఁడు.

వార—మహారాజా! సెలవు.

జయ—మంచిది.

(వారకాంతలు నిష్క్రమించుచున్నారు)

జయ—(మంత్రి నుద్దేశించి)

తరల. కలవు నామది రెండు కోర్కెలు ♦ కామసన్నిభరూప నీ

వలనఁగానని యంటివేనియు ♦ వచ్చువారిని బట్టిపో

దలఁచినాఁడను నమ్మునీమది ♦ దక్షిణంబ యొనర్పఁగా

వలయుఁగావునఁ జెప్పెద న్వినుఁ ♦ వారకన్సచివాగ్రిణీ! 22

శ్రుత—రాజా! మీ యిచ్ఛను వచ్చిన తెలుంగున వర్ణించుచున్నాఁడను. అవి యెట్టివియో సెలవొసంగుఁడు.

జయ—తే. గీ. వినుము సెల్లెలి విడచితి ♦ విపిననుందు

బంటులను వేగఁద్రోసేఁ ♦ బనుపుటొకటి

తక్షణమ్ము దుర్గంబుపై ♦ దండు వెడల

కార్యమది రెండవది నమ్ము ♦ ఘనగుణాఢ్య! 23

శ్రుత—ఆర్యా! అదియెంతపని. ఇప్పుడే తమకోర్కెలు నెఱవేర్చెదను. రండు కోటలో నికిఁబోవుదము.

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

తే. గీ. అవనిగుణసుర్యకోట య ♦ నంతశాస్త్రి

వర్యునకు గూర్మి శిష్యుఁడై ♦ వరలునట్టి

యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత

వ్రాయఁబడె నిటిభూమిపై ♦ వరలుగాత. 25



# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## సప్తమాంకము

### ఉద్యాన వన విహారము.

[బాలికలు బంతులుదూలించుచు నొకరివెంబడినొకరు ప్రవేశించుచున్నారు.]

కమల—(తోడివారితో) ఇప్పుడెన్నిగంటలయినది.

రేవతి—సాయంకాలము నాలుగు గంటలయినది.

కమ—ఓచెచ్చెలులారా! మనము చెండ్లాట మానివైచి యీపుష్పవాటికలకు నీరుపో యవలెను.

చెలికత్తెలు—మంచిది. (అని బంగరుకలశంబులు చేతితోఁబుచ్చుకొనును)

రేవతి—అక్కా! నాకామొలకల పేర్లను బ్రత్యేకముగాఁ జెప్పుము.

కమల—మంచిది.

సీ. కేసరీ మధ్యరో ♦ కేసరి యయ్యది, తిలపుష్పనాసిక ♦ తిలకమదియె
అంబుజవదనరో ♦ యంబుజమలది,చంపక పరిమళీ ♦ చంపకమిది
కర్కగండద్వయీ ♦ కరకమదేకమ, గుణగుణాతీత ♦ గణికమదిగొ
పౌండ్రకలోచన ♦ పుండ్రకమియ్యది, సుమనఃమనోహారీ ♦ సుమనమిదియె

తే. గీ. అల్లవేచూడు కరవీర♦యామ్రబిల్వ,నకుళవంజుళ చాంపేయ♦పనసజంబు
పారిజాతకస్యందన♦శారదాది, పుష్పరస పరాగములతో ♦ పొల్పెసంగు. 1

అదిగాక.

లయగ్రాహి. చెల్లెలరసాల మది ♦ యల్లజను పాంథులకుఁ
జల్లగను నీడలిడు ♦ నుల్లములెలర్పన్
కొల్లలవె మల్లికమ ♦ తల్లికకదంబమును,
నెల్లి బదరీవకుళ ♦ వల్లరినులమ్మా



మల్లెలు సమీరణను ♦ మొల్లలు సుజాజి విరి,
తెల్లను సువాసనలు ♦ జెల్లును గదమ్మా
యొల్లడలఁజూచినను ♦ వల్లరిలు వల్లులును,
నల్లుకొనియున్న పొద ♦ రిళ్ళు గనుబాలా.

(నీళ్లు పోయుట నభినయించుచున్నారు)

లయవిభాతి.

రోహిణి— సెలత విరజాజివిరుల ♦ లలిఁ దిలకించు మది
నలుదెసలగ్రమ్మి యల ♦ యలరునిరువయ్యెన్

శ్యామ— మెలఁతపొదరిళ్ళు మన ♦ యలతలనుబాపుటకు
నెలఁత నెలవయ్యెగదె ♦ నళినపదయోషా

సుందరి— పొలఁతిమరుకేళికిది ౘెలువమగునీకునిటఁ
గల లతలువల్లరిలు ♦ జిలిబిలిగ నుండెన్

(అని శ్యామలను బరిహసించు చున్నది)

శ్యామ— చెలివయసుగుబ్బలన ♦ వలపువిటకాంద్రగవఁ
గలయు టదిగల్గె పెలు ♦ పలుకులిఁక నేలన్. 3

(అని నవ్వుచున్నది తోడివారు చప్పటలుకొట్టుచున్నారు.)

కమల—మీమీపరిహాసములకేమిగాని.

సీ. ఆకసంబనులక్ష్మి ♦ కందెలకై పైడి, పారసికరఁగు కుం ♦ పటియనంగ
సురలురక్కసులును ♦ సురకుఁబోరాడఁగ, సమరభూమినిగాలు ♦ క్షతజ మనఁగ
గగనమండపమును ♦ కల్యాణవసతికి,సింగారముగఁబూయు ♦ జేగురనఁగ
చూపజ్జిమదులకు ♦ సొబగుగాగన్పించు,పూచినమోదుగు ♦ పూతయనఁగ

ఆ. వె. తోవకువన్నెతాల్చె♦తోయజమిత్రుండు,తనదురాణిపొందు♦తలఁపుహెచ్చి
వడిగఁదేరితోడ♦పశ్చిమసాంద్రంబు,జేరుచుండెగనుఁడు♦చెలియలార. 4

కావున మనమాలసింపరాదు. వెంటనేపూవులఁ దునుముకొని యింటికిఁబోవుదము.

(తోడివారు) మంచిది. (అనికలశము లచ్చటనుంచి పుష్పగుచ్ఛములగోయుట మొదలుపెట్టిరి)

హయగతిరగడ.

కమల—రామరమ్మిటు గుందకుట్మల ♦ రాజిరాజిలుచుండెగాంచుము

(అని చెలికత్తెలకుఁజూపుచు మల్లెమొగ్గలు గోయుచున్నది.)

రేవతి—శ్యామచామపత్రివాళరక్తిమ ♦ సారసౌరభ మెంచుమెంచుము

(అని పగడపుఁగాయలనుగోసి శ్యామలకుఁజూపుచున్నది.)

సుందరి—బాల బాలసమీరణంబదె ♦ ప్రియప్రియముగా నలందెను

(అని మణిమాలకు మల్లెతీఁగెలను జూపుచున్నది.)

మణి—లీల లీలప్రసూనములీనవ ♦ లీలలీలగఁ గోయుమందును

(సుందరితోననుచున్నది.)

కమల—చెలియ చెలియలగంధఫలిబలి ♦ చెలఁగి చెలఁగు చునుండెఁగనుమది

(అని చెల్లెలకుఁజూపుచున్నది)

రేవతి—చెలువ చెలువముఁజూడుసంపెంగ ♦ జిలుగుజిలుగుకఁబూచెనమ్మది

(అని అక్కయైన కమలకుసంపెంగచెట్టుఁజూపి పూవులు గోయుచున్నది.)

శ్యామ—నామనామరపారిజాతము ♦ వన్నెవన్నెలుగులుకు శ్రేయము

(అనిరోహిణికిఁ బారిజాతభూజమును జూపి పూవులుగోయుచున్నది)

రోహిణి—చామజామిని శేషముగ నిర ♦ జాజిజాజులుగోయుమందుము

(అని శ్యామలకుఁజూపి విరజాజపూవులుఁ గోయుచున్నది.

కమ—చానజాణరొ గైకొనఁగదె ♦ చాలమేలగు సూనములీ నివి

(అని పుష్పములు సుందరికిచ్చుచున్నది.)

సుంద—వీణగానాదివినోదినీ యీ ♦ పికపికంబుల నాదనుదిపిను

(అని రసాలసాలమీఁదికోయిలలనుఁ జూపుచున్నది.)

మణి—మదనసదనవె యాఘ్రాణించుము ♦ మరువకురువసువాసనంబులు

(రేవతికి మరువ కురువ పత్రినిగోసి యిచ్చుచున్నది)

రేవతి—పడపడల్లదె ష్టష్టిజూడుము ♦ బాలమాలతిపుష్పచయమును

(మణిమాలను త్రొంచెముదూరము దీసికొనిపోయి మాలతిపుష్పముల జేతికిచ్చి చూపుచున్నది)

శ్యామ—చారుసారసముఖిము నేలెడు ♦ పరసరసమణిదమన మదిగను

(అని రోహిణికి దమనముగోసి యొసఁగుచున్నది)

రోహి—దూరబారుల నడకదిద్దెడు ♦ తొయ్యలియ్యది దులుముతులుమున

(శ్యామలకు దమనమును గొప్పననుంచుచున్నది)

సుందరి—సిబ్బిగుబ్బెతవిరులువేసెటులు ♦ చెడి వీడక కానుకొమ్మిక

(అని మణిమాలను పుష్పచయముచే కొట్టుచున్నది)

మణి—యచ్చెబెబ్బులిరీతినుంటివి ♦ యాఁగుమ్మాగుమ్మా నాతో సరసమె

(అని పారిపోవుచున్నది)



శ్యామ—యేదియేదిటు తిరుగుమా నా ♦ యేటుకేటుకు పారిపోయెదు

(అని సుందరిని బుష్పములచేఁ గొట్టుచున్నది)

సుందరి—మీఁదిమీఁదికి వచ్చుచుంటివి ♦ మున్ను మన్ననుగాన కటునిలు

(అని శ్యామలను విరులచే గొట్టుచున్నది)

శ్యామ—మాటలేటికి చేతనైనచో ♦ మారుమారొక్కని తిరుగపోకుము

(అని సుందరిని తిరుగబుష్పములచే ముంపుచున్నది)

సుందరి—బోటి సూటిగ సూనముల్తతి ♦ మీటి గోటడగింతు నిల్వవె

(అని శ్యామలను మఱింతపుష్పములచేఁ గొట్టుచున్నది)

శ్యామ—కాలుగాలిన పిల్లికైవడి ♦ గంతులేఁతులు నైచిడేలకో

(అని కోపముతో నుడికిపోయి బల్కుచున్నది.)

సుంద—ప్రేలుమాలిని పల్కులేటికి పట్టుబట్టుము నాతో వేగమె

(అని కచ్చబిగియుగట్టుచున్నది)

కమల—తాళుతాళుడి డీకొటివాక్కులు ♦ తప్పులొప్పులుగానకుండగ

(అని సుందరిని దూరముగా గెంటివైచుచున్నది)

రేవతి—చాలుచాలును నెంతలోపల ♦ సగసము ల్విరసములుఁ జేసిరి. 5

(అని శ్యామలను దూరముగా గెంటివైచినది)

కమల—(తోడివారితో) అదిగో! మా దాదియగు చంద్రమణి వంటకములం దెచ్చుచున్నది. మనమా పూపొదరింట చెంగటఁగూర్చుండుమురండు.

తోడివారు—మంచిది. (అని యందఱుఁ గూర్చుండిరి)

చంద్రమణి—(ప్రవేశించి) అమ్మా! ఇదిగో! తినుబండములు మీ సవతితల్లిగారు యిచ్చినారు.

కమల—చెలియలా వీనిని దీసికొనుము.

రేవ—మంచిది. (అని తీసికొని) యీ పెద్దమిఠాయి యుండ యెవరికి ?

చంద్రి—మీయక్కగారికి.

రేవతి—(అందరికి నిచ్చుచున్నది)

చంద్ర—అమ్మగారు త్వరగా రమ్మని యానతిచ్చినారు. సెలవుఁదీసికొనిపోయెద.

కమల—మంచిది.

చంద్రి—(నిష్క్రమించుచున్నది.)

శ్యామ—(మిఠాయి చేతితోఁ బట్టుకొని సుందరిని జూచి)

చం. పిలుపగనీదుచాచులకు ♦ దధ్యముసాటిగ నున్నదే కదా
యిలపయి రెండుపట్టృవలె ♦ యీడగు రూపమునందు గాని యిం
దుల నిదిమూను పేర్మిమనుమి ♦ తోరము గాగను పన్నెకాండ్రికున్
గలుగ జేసియురచ్చెదము ♦ గాంచినచో నెదయందు సుందరీ

సుంగ — (కొంచెముకోపముతో) ఔనౌను.

ఉ. ఎచ్చటనున్న పూవుపొద ♦ రిందులయందున సందుగొందులన్
గెచ్చన డొంక దేవళము ♦ గేడగిచెట్లను నాదువాసమే
మచ్చర మెచ్చిపేర్కెదవు ♦ మాటలు నేర్చితి సంచుచాలు ఛీ
ఫుచ్చటికంబువీడిభువి ♦ ఫుట్టుటకం కెను జావు మేలకో. 7

(అందరు నవ్వుచున్నారు.)

గోపిం — ఏమిటీ మొన్నటి సాయంసంధ్యావేళ,—

ఉ. కచ్చలువీడిపోవఘులు ♦ ఘుల్లనియందెలు మోర్మియాఁ జైటలో
మచ్చరిచాటిగోయిమతి ♦ మంపుగ నాట్యము నాడముంగురుల్
హెచ్చగ మోము పైపిరియ ♦ నెవ్వరు తీరిన మాటలాడకన్
పచ్చట నీదుచేష్టలపు ♦ వారక చూచెదు హా రెఱుంగరే 8

మణి — మొన్నటిసాయంసంధ్యా పరిశీలనయేల నిన్నటి మధ్యాహ్నకాలమున రెండవ యామము వేళ,—

ఉ. వాడినమోముతోడ దరి ♦ వాలికకన్నులతోడఁ జంపకున్
వీడినకొప్పుతోడ మెయి ♦ వీడినసొమ్ములతోడ యారజ
వ్వాడెడుకొనుతోడనెదఁ ♦ బాసిన పయ్యెదతోడ మేనునం
గూడినధూళితోడఁగను ♦ గొంటిని పూపొదరింట చెంగటన్ 9

క. ఆమూపురేఖ సొగసే, వారలుగన్న నిజమీయు ♦ వతిమారునిబల్
కూర్గశరవార్తముచే, నీరీతిండనరెవంచు ♦ నెంచరె మదిలో 10

రేవతి — ఇసీ. సిబ్బితలేక మీకడుపుబ్బుతనంబుచే నోటికివచ్చినట్లు మాటలు పేర్కెదరేల! మిన్నకుండుడు. పుట్టినవి పోటుపుట్టక కదా!

కమ — చెల్లెలరేవతీ! నా నాలుక జిలజిలమని లాగుచున్నది. దాహము మిక్కుటముగా నున్నది. ఇక జీవము నిలువనట్లు తోచుచున్నది.

(అనిపరున్నది.)

రేవతి — చెలీ! రోహిణి. మా యక్కగారికి మిక్కుటముగా తృష్ణగలిగి యున్నది జలములందీసుకొని గ్రక్కునరమ్ము.



రోహి — మంచిది. (అని నిష్క్రమించుచున్నది.)

రేవతి — (విచారముతో) ఓసఖీమణులారా! మాయక్కనోటమాట, కంటఁజూపులేకయే పడియున్నది. అదియేమో కారణము తెలియదు.

(అని కన్నీరు నింపుచున్నది)

చెలికత్తెలు — ఆహా! మరణసూచకములగు చిహ్నములు గాన్పించుచున్నవి. ఎంతలో నెంతకష్టదశ ప్రాప్తించెను. (అందరు నొక్కసారిగా)

విచారలాహరి. ఓసఖీసఖీసఖీ ♦ బాసిపోవ మేలటే
వీసమైనజాలిలే ♦ కాసవీడఁగా మముక్ సఖీ

2. చిన్ననాటనుండి నిన్ ♦ మన్ననాతోఁ జూడఁగా!
జన్నె మమ్ముబాసి య ♦ న్నన్న నీతోఁగూర్పకన్. సఖీ 12

3. పాల్విలుమాలినట్టియీ ♦ నేల నీకువింతగా
పూలపాన్పు జేసెనా ♦ కూళదైవ మోర్వకన్. సఖీ 13

4. పంతమేల నే యిదే ♦ చింత దీర్పగా మముక్
గాంత వేగిరంబునీ ♦ చెంత జేర్చుకోవలెన్. సఖీ 14

మణి — మన మెంత విచారించినను లాభమేమి?

రేవతి — (కమల పైఁబడి) అక్కా!

చ. ఘువతరలీల నిన్ను నతి ♦ కాంక్షను బెంచెదు తండ్రి యీపయిన్
మనుటయిఁ కెట్టులీసఖులు ♦ మానినిరో చరియించు టెట్టునే
ననువుగ నీదుపాదము ల ♦ హర్నిశముల్ విడనాడకుంటి నా
వనటుల సొందరిమందు ఘము ♦ వైచితినేనికనిల్చు టెట్లొకో. 15

అదియునుంగాక.

సీ. జననికుర్వింకెనను ని ♦ చారము లేకుండ, ననువునఁ బెనిచెఁగా ♦ నాదుతల్లి
మాతపోయిన బాల ♦ ఖ్యాతిగానిన్పెర్తి, ననయంబుబోర్పడే ♦ మనదుతండ్రి
సవతిపైవోడని ♦ జనదాటి నీమాట, లెంచక నడుతునే ♦ యెన్నఁడైన
ఘనముగా నీయాజ్ఞఁ ♦ గైకొనియేకదా, పనులుగావింతురీ ♦ పద్మముఖులు

ఆ. వె. కటకట! నినుఁబాసి ♦ యెటుల జీవింతు నా కేటిబ్రతు కికేటి ♦ కీటాడవు లి
కేటికీ కుసుమము ♦ లేటికి నా మెలో ఘాత నన్నుగూడ ♦ దరికిజేర్పు.

శ్యామ—అమ్మా! యేలవిచారించెదవు.

తే. గీ. అప్పుడీటిన వస్తువే ♦ ద్దానినైన
వజ్రపేటిక నిడిమదర్రి ♦ వైచి పదిల
పరచిననుబోడ మనము గ ♦ న్పట్టగలమె
సఖియ నీటంబోయినచాప ♦ చందమునను. 17

కాఁబట్టి నీదుఃఖమునుజాలింపు, ఈమె విషపూరితమైన మిఠాయి దినినటుల నా మనంబునకు దోచుచున్నయది. లేకున్న యింతలో యంతపని జరుగదు. ఈసంగతి మీనాన్నగారికి శుశ్రతపరచవలెను. లెమ్మ యిచ్చటనుండిన నీవిచారముమాన్ప మా శక్యముగాదు. (అని యామెహస్తమునుం బట్టుకొని తీసికొనిపోవుచు (మణిమాల, సుందరినైపుఁజూచి) మీ రిచట భద్రముగానుండుడు. వాహకులను బనిచెద.

(అని రేవతితో నిష్క్రమించుచున్నది)

సుంద—అన్నన్నా! చెల్మికి సాటియగు పదార్థమెద్దియు గానరాదుగద.

సీ. ఆపదలను మహా ♦ యబ్ధినిమున్గుచో, తరణియై రక్షించు ♦ ధరను జెల్మి
యెంత మర్మమునైన ♦ మంతనమున దాచ, వజ్రపేటికయన ♦ వఱలు జెల్మి
యజ్ఞానమను మహా ♦ యంధకారముబాప, భాస్కరకాంతియై ♦ ప్రబలుఁ జెల్మి
యిచ్ఛానుసారేచ్ఛ ♦ స్వేచ్ఛగా మాటాడు, ఘనుల పాలిఁటగ్రంథ ♦ కర్తచెల్మి

తే. గీ. అహహ యిట్టిసుఖంబుల ♦ కాస్పదమయి తనదు జీవముకన్న సు ♦ మనల గొప్పదు
కరుణతోఁబ్రోచిరక్షించు ♦ కమలఁబాసి బ్రతికియుంటిని నిర్జీవ ♦ ప్రతిమవలె

మణి—సుందరీ! యింతలో నీమె విగతజీవియగుటకు గతంబెద్దియో నీకుఁదెలియునా?

సుంద—సఖీ! నాకేమియుఁ దెలియదు.

మణి—ఈమె సవతితల్లియగు చిత్రరేఖ పన్నుగడవలన సమసెనని నిశ్చయించెద.

సుంద—ఎట్లు.

మణి—చిత్రరేఖ కమలకు సవతితల్లియగుటచేతను, జనకునకు నీకమలయందతి ప్రేమాతిశయంబు లుండుటచేతను, రేవతియందంచుక జాలి తక్కువగా నుండుటచేతను, నామెచే జరిగెనని యోచించెద.

సుంద—నేనును అటులనే తలంచెద. (అని యిటునటుజూచి) అదిగో వాహకులు వచ్చుచున్నారు.



వాహకు—(ప్రవేశించి) అన్నన్నా! చిత్రరేఖమహిమ్మగాని మతియొకటిగాదు. అకట పసితనమందుయెంతపగవారికైనను తల్లి చనిపోరాదు.

మణి—(వాహకులతో) ఈమెను బహుజాగ్రతగా ధర్మవైద్య శాలకుంగొనిపొండు.

వాహ—మంచిది. (అని యామెను దీసుకొనిపోవుచున్నారు)

(సుందరిమణిమాలలు నిష్క్రమించుచున్నారు)

తే. గీ. కొమరిపురఫాలశ్రీవేణు ♦ గోపబాల
వరప్రసాదలబ్ధకవిత్వ ♦ సరసుఁడైన
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత. 19





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## అష్టమాంకము.

### జయచంద్రుని కోర్టు.

(జయచంద్రుఁడు, శ్రుతశర్మ, నారాయణశాస్త్రి వేంకటశాస్త్రులుగార్లు నిరుపక్కల నుంచుకొని సింహాసనముమీఁదఁ గూర్చునియుండ)

జయ—మంత్రిపుంగవా! నేటిదినమునఁ దీర్పవలసిన తగవులేమి?

శ్రుత—దేవా! మానవవర్మగారాబుపట్టికి విషమిడి చంపినదని యపవాదుపడిన చంద్రమణికేసు విచారించవలెను.

జయ—వాదిప్రతివాదులు హాజరయినారా?

శ్రుత—దేవా! హాజరయినారు.

జయ—అయినచో బిలిపింపుము.

శ్రుత—చిత్తము. (అనిబంటుతో) ఉభయపక్షములవారిని హాజరుపెట్టుము.

బంటు—చిత్తము. (అనీ ద్వారము కడకువచ్చి) మానవవర్మ! మానవవర్మ! మానవవర్మ! (కేకలువేయుచున్నాఁడు)

మాన—చిత్తము. (అని రాజునెదుట నిలువఁబడుచున్నాఁడు)

జయ—నీవేనా! వాదివి.

మాన—చిత్తము.

జయ—ప్రతివాదినిగూడ పిల్వుము.

నారా—దేవా! ఆ మెఘోషాస్త్రీయగుటచే నామెపై నేరమారోపణయగుపటకు నామెను రచ్చకు బిలిపించరాదు. అందులకు భరణమెవరో సంగెదగు?

జయ—దానికిఘోషాయేమిటోయి.

వెంక—వారి న్యాయమునకుఁగూడా యిట్టిఘోషాకలదేమో?



జయ—పోనిమ్ము. వాదివాబ్బామ్లానంతరమామెను రప్పించవలసి యుండునెడ రప్పించెదము.

శ్రుత—(మానవవర్మతో) ఓయీ మీకెవరైన సాక్షులున్నారా?

మాన—చిత్తము. దేవగుప్తుఁడను కోమటి గలఁడు.

శ్రుత—హాజరయినాడా?

(అంతట దేవగుప్తుడు ప్రవేశించును)

మాన—దేవా! యీతఁడే. (యని మాపుచున్నాడు)

దేవ—(మానవవర్మ చెవిలో) నాకీయవలసిన లంచమిప్పుడే ఫయిసలు చేయకున్న నేను నీవు చెప్పినట్లు పల్కను.

మాన—సాక్ష్యమనంతరమున తప్పక యిచ్చివేసెదను.

దేవ—నేను సాక్ష్యానంతరమందే నీవు చెప్పినట్లు చెప్పెద. కోమటి సాక్ష్యమని యెఱుంగవు కాఁబోలు.

బంటు—(దేవగుప్తునితో) యీబోనుపై కెక్కుము.

దేవ—మంచిది. (అని బోనుపైకెక్కుచున్నాఁడు)

బంటు—(రామాయణముఁ దేవగుప్తుని జేతికిచ్చి) శిరముపై నిడుకొమ్ము, (అటులఁ జేయుచున్నాఁడు) ముమ్మాటికి దేవునియెదుట. అను (అటులనుచున్నాఁడు) న్యాయము జెప్పుతాను. అను.

దేవ—ఆ, న్యాయముఁ జెప్పుతాను!

నారా—మానవవర్మకుమార్తె యాకస్మికముగా మృతినొందుటకుఁ గారణమేమి?

దేవ—విషపూరితమగు మిఠాయి భక్షించుటవల్ల.

నారా—అదియామెకెట్లు వచ్చినది?

దేవ—చంద్రమణి పెట్టుటవల్ల.

నారా—చంద్రమణి కెట్లువచ్చినది?

దేవ—(ఊర్ధ్వదృష్టితో) ఛి. కాదు. చంద్రమణియే స్వయముగా గొనియందు విషమిడి యుండవచ్చును.

నారా—దేవగుప్తా! మొదట ఛి. తరువాత. కాదు. చంద్రమణియని వచించుటకు గతంబేమి?

మాన—(నుల్లోచనములు సన్నరించుకొనుచు తత్తరపాటుతో) ఇస్! సాక్ష్యము తేలిపోవునట్లున్నదని వడబడుచున్నాఁడు.

దేవ—అయ్యా? నేనేమన్నాను భి. కాదు. త్రి. లేదు. ఖ. అవును. కాదు. లేదు. అవును. అన్నానా యేమి? అయినతుమింపుడు. ఒడలు కంపమొందుచున్నది. చివరమాటయే సత్యము. ఇంక సాక్ష్యమీయఁ జాల.

(అని గడగడవడఁకుచు బోనుపైనుండి దిగబోవుచున్నాఁడు)

శ్రిత—~~[illegible]~~ సాక్ష్యమానంతరము గాని బోనుపైనుండి దిగుటకు వల్లగాదు.

దేవ—సరిగా నిలుచున్నాఁడు

వెంక—ఓయుభయమేల? అబద్ధపు సాక్ష్యము కనుకనా! సరిగా నాలోచించుకొని చెప్పుటకు.

దేవ—మీరెట్లుగ్రహించితిరి.

శ్రిత—ఏమోయి అటులను చుంటివి?

దేవ—దేవా! యేమంటివి ?

జయ—(కోపముతో) వీనిసాక్ష్యమింకఁ జాలు. తాగుబోతువానివలె ప్రేలుచున్నాఁడు. కొట్టులోఁ బడవేయుఁడు.

శ్రిత—(బంటువైపుఁ జూచి) వేగమే వీని కారాగృహమందుంచుము.

బంటు—చిత్తము. (అని వానిని దీసికొని పోవుచున్నాఁడు.)

దేవ—అయ్యో! నేనీయబద్ధ సాక్ష్యమిచ్చినందులకు విధిగానన్ను గొట్టులో బెట్టవలసినదే. (అని బంటుతో నిష్క్రమించుచున్నాఁడు.)

జయ—చాలు. వాడియొక్క సాక్ష్యమవసరము లేకుండఁగనే నిజము తేలినది. వాదియైన చిత్రరేఖను గూడా కొట్టులో బడవేయుఁడు. ప్రతివాదయైన చంద్రిమణిని యొక్కసారి పిలిపింపుడు.

శ్రిత—(బంటుదెసఁజూచి) చంద్రిమణిని తోడ్కొనిరమ్ము.

బంటు—చిత్తము. (అని చంద్రిమణితో ప్రవేశించుచున్నాఁడు.)

జయ—అమ్మా! మీకేసు విచారణమైనది. మీరు గెల్చినారు. గాన మీనివాసమున కుంబోండు.

చంద్రి—(విచారముతో) నాయనా! యింక నామందిరము మరలసంద్రిమే?

శ్రిత—ఏమమ్మా.

చంద్రి—(విచారముతో)

సీ. సరససద్గుణ గణా ♦ సంయుతుండైనట్టి, రత్నపురాధీశు ♦ రాణినయ్యు
సుగతుండుని మెడు ♦ బలుండగు వంగల్ల, ప్రభునకుగారాబు ♦ భగనినయ్యు



రతనంపుమైకాంతి ♦ రాజిల్లు జయచంద్రి, చంద్రరేఖలకునే ♦ జననినయ్యు
వరులనుసోదర ♦ భావంబుగానెంచి, శిరమెత్తి చూడని గరితనయ్యు

తే. గీ. బ్రిస్మావారిసినవారితఁ♦త్రిప్పంగవశమె, యొకరియింటనుదాసినై♦నుంటగాక
నిండలకుఁగూడ బాలైతి ♦ నేమనందు, కట్ట! నాజన్మమింకేలఁ ♦ గాల్పనహహా

దైవమా! ఆనాఁడు దుశ్శీలుఁడు ప్రియునిఁజంపి బిడ్డలను గాననమందుఁ గడ తేర్పుమని యాజ్ఞనొసంగినప్పుడు బ్రతుకువైరోసి వారాసిలోఁ బడితినిగద. ఏల జాలరివాండ్ర చేతిలోఁజిక్కితి. తిరుగ పారావారంబునఁ జోరక నీరాజు నొద్దసుశీలయను నామంబునకు మారుపేరు గల్పించుకొని దాసిగానుంటి. ఛీ. ఇట్టి యిక్కట్టులకు లోనగుటకు కాఁబోలు. ఇంక నేమిబ్రతుకు. (అని విచారించు చున్నది.)

జయ—ఏమేమి! మరలనొకసారి యిప్పుడన్న వాక్యంబులు వాక్రుచ్చుము.

చంద్ర—మహారాజా! నేనేమియుఁ దప్పులు వచింపలేదు. నా బ్రతుకును గుఱించి నిందించు కొనుచుంటిని.

జయ—అదికాదు. మరల వినవలెనని తాత్పర్యమున్నది.

చంద్ర—(విచారముతో తిరుగ)

“సీ. సరస సద్గుణగణ ♦ సంయుతుఁడగునట్టి
రత్నపురాధీశు ♦ రాణినయ్యు” [అను పద్యము చదువుచున్నది]

జయ—(సింహాసనమునుండి దిగి తల్లిని గౌఁగలించుకొని)

ఆహా! నా పూర్వపుణ్యసంచితంబు.

మ. వనమధ్యంబున జంపుమంచుఁ బరితో ♦ వైళంబ మమ్మంపఁగా
వనమధ్యంబున నీవుజొచ్చితిగదా ♦ ప్రాణంబులం బాయఁగా
వనమధ్యంబున దైవయోగమునజీ ♦ వంబుల్ విడెక్ బోయికిక్
వనమధ్యంబున నీవు జాలరులచేఁ ♦ బట్టం బడం బున్యమా. 2

అదియునుంగాక.

మ. కలనైనన్ నినుజూతు నంచు మదిలోఁ ♦ గాంక్షింప వీలేది యా
జలరాసి న్బడుట న్మము న్నటవిం ♦ జంపంగనంపించుటల్
దలఁపన్వచ్చునె యెన్నఁడైనదిరుగక్ ♦ దర్శించుటాండ్లకున్
గలుగన్వచ్చునె యెట్లుదల్చెద మహా ♦ కంసారిమాయల్ గదా.

మంత్రిపుంగవా! మదీయభాగ్యంబు కతనకన్న జననిని గన్నులారఁ గాంచుటగలిగె. దైవయోగంబునకు నసాధ్యంబు కలదా? ఇదియంతయు మాయగానున్నది. మా చెల్లెలుకూడ మమ్ము కలసికొనుట యొక్కటి యున్నది.

చంద్ర—కుమారా! చెల్లె లేమయ్యె?

శ్రుత—రాజా! మీయంబ గారని తెలుసుకొన్న తరువాత యిచ్చట నామెను నిల్పుట కర్జంబుగాదు. రండు పోదము.

జయ—మంచిది. (అని యందరు నిష్క్రమించుచున్నారు.)

తే. గీ. పృథ్వి సూరన నూరన ♦ భీమనాఖ్య
సుమతి సీతయార్యులభ్రాత ♦ కొమరుఁడైన
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపైఁ ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము

## నవమాంకము.

[ప్రదేశము.—రత్నగిరి, దుశ్శీలుని కుటిలాలోచన సభ.]

(దుశ్శీలుఁడు, దుశ్చేష్టుఁడు, దుర్బుద్ధి, మతిమంతుఁడు, సత్యసేనుఁడు, జనార్దనసింగు, నారాయణసింగు కూర్చుని యుండఁగా)

దుశ్శీ—జయచంద్రుని యుద్ధవార్తాపత్రిక వారము దినములక్రిందటనే జూచి యుంటిఁగద. పమర సన్నాహులు గాక యేలయూరకుంటిరి? మీయూహ లేవియో తెల్పుఁడు.

మతి—రాజా! మీకాగ్రహము వచ్చినను సరేకాని.

ఆ. వె. నిజము దేవుఁడెఱుంగు ♦ నీరు పల్లమెఱుంగు
ననెడు నార్యపల్కు ♦ లనఘ వినమె
యెన్ని కష్టచయము ♦ లెనయించి నను గాని
తుదకు బాలుఁడు సుఖ ♦ మొదవునుమ్ము. 1

అందుల కుదాహరణము కావలెనంటివా.

తే. గీ. మున్ను దుర్యోధనాదులు ♦ పన్నరారి
పన్నికలు పన్ని యటవుల ♦ పాలుఁ జేయ
పాండువంశజు లేలరే ♦ వసుధయెల్ల
నంచు భారతకథ లెఱిఁ ♦ గించ వినమె. 2

కావున యికనైన నన్యాయపు ప్రవర్తనము మాని, యాతని తండ్రి రాజ్యము యాతని కొసంగుము.

దుశ్శీ—కం. పుట్టినది రాజవంశము, పట్టణము న్వీడవ తాను ♦ బవరంబున నఱ
గిట్టించఁగవలె నంతకు, నిట్టిలమిది నమ్ము మింక ♦ నెట్టికశీలా

సత్య—(స్వగతమున) అదియెంతపని ?

నారా—నృపా! తే. గీ. పల్కవచ్చు నెన్ని ప్రగ ♦ ల్భ్యములనైనఁ
గష్టమవిచేయు టేలాటి ♦ ఘనులకైన
మున్నురాజ్యము మీరు నై ♦ కొన్నరీతి
నెఱుఁగమే యిటుపల్కెదో ♦ నృపవరేణ్య. 4

సత్య—పృథ్వీశా! యిటువిను.

చ. కపటముఁ బన్ని రేనడుమ ♦ గాఢముగా నిదురించుచున్న మా
నృపతిని జంపి రాజ్యరమ ♦ నేలితివంతియెగాక యిట్టులీ
శపథ మదేలబాలకుని ♦ సంగర రంగమునం జయింతునం
చిపుడ లుగంగఁ బౌరుష ము ♦ దేకడ నిల్చెను మున్నుభూవరా. 5

దుశ్శీ—సచివా! ఇంచుక మంచిచెడ్డలుయోచించక పచించుచుంటివి. ఆ ప్రభాకరుం డుసకలజన వశీకరుండు, రాజ్యాధిపతి, సకలసైన్యమాతని పట్టయి యుండును. నేను యెుంటిరిని కావున నక్తరాత్రంబున నిద్దురఁబోయెడు వానిం బరిమార్పవలసివచ్చె. ఇప్పుడన్ననో యీజయచంద్రుఁడు నేనును సమానముగాపోరాడుటకుఁ దగిన సేన యున్నవారమే కదా.

దుశ్శే—(కోపముతో)

క. ప్రగ్గడకొంచము హెచ్చుం, దగ్గలు లేకిటులనాడఁ ♦ దగు సేనగరే
సిగ్గేల లేకఁ బల్కెద, వెగ్గొనరింపగఁదల్చి ♦ తేమిటి యొకొ.

జనా—(కోపముతో దుశ్శేష్టునిఁజూచి)

శా. ఔరా గర్వమదాంధకార యిటు యు ♦ క్తాయుక్తము ల్గానకన్
కారుల్ ప్రేలెద వేల మాసచివునిం ♦ గానిమ్ము క్రూరాత్మ యీ
సారిం బైరణచేసినాఁడ నిక నీసా ♦ మంతము న్మాని నీ
నోరన్మూసుక నూరకుండు మిటపై ♦ నోరెత్తినంజూడుమీ. 7

[అని పిడికిలిం గనపరచుచున్నాఁడు]

నారా—(జనార్దనసింగు నైపుఁజూచి)

ఉ. కూళుఁడు దుర్జనాళి కను ♦ కూలుఁడు క్రూరుఁడు నోర్వలేక చం
డాల స్వభావముం దెలియ ♦ డంబుగఁ బ్రేలిన నేమి మత్తకుం
డాల్గము వీధిఁబోవ వెను ♦ డాయుచు నక్కలుసాచి గ్రామ శా
దూలము లెల్ల నేకముయి ♦ రోదనఁ జేసిన గొప్పబోవునే. 8



దుశ్శే—ఓరీ! రాజద్రోహులారా! హీనవంశ సంభూతులారా! మీయిచ్చకు వచ్చిన తెఱంగున మచ్చరంబులుచ్చరించు చుంటిరిదద్దా. కానిమ్ము సమయమువచ్చు వఱకును మీరాఁడుమాటలకు నోడియొగ్గవలెనె.

(అని వారలవైపు కోపముతోఁ జూచుచున్నాడు.)

నారా—భుజంగప్రయాత. ఒడిన్గట్టకన్మూఢ ♦ యొక్కింతమవిమ్మో
యెడన్నీవు నేడిట్టి ♦ యెగ్గల్పవచింపన్

దుశ్శే— పొడింజేతుమే మెుక్క ♦ మూర్ఖాంబులో

జనా— నీ గడింరమ్ము లేలెమ్ము ♦ కౌటిల్యబుద్ధి. 9

దుర్బు—ఏల ? మీమీక్రోధంబులెల్ల వెల్లడి చేసికొనియెదరు.

దుశ్శే—దురాత్మా! (లేచి) పద్మనాభ వృత్తము.
ఈమారునీలాగు దుర్భాషలంబల్క ♦ నీరేడులోకంబులం డాగియున్నన్
భూమీశవాణీశ లక్ష్మీశగౌరీశ ♦ ముఖ్యుల్ నివారించినం వీఁక ద్రుంతున్

నా—చీ మాటకున్మేటి శూరుండనై నిల్చి ♦ చేయంగ సంగ్రామము న్వేగరమ్మా
ఈమాటలేలావృథా ప్రేలుటేలావి ♦ హీనాత్మవాదా ♦ నిజండబాడరాదా.

(అని నిలువఁబడుచున్నాఁడు.)

దుశ్శే—(కత్తి గిరగిరద్రిప్పుచు) అన్నా! దుర్బుద్ధీ!

ఆ. వె. అగ్నిహోత్రమందు ♦ నాజ్యంబునిడఁ బ్రజ్వ
రిల్లునట్లు నాకు ♦ నుల్లమందు
వీనిపల్కులెల్ల ♦ వేడిమి సేయంగ
నైపఁ జాలనింక ♦ సరగరమ్ము. 11

నారా—ఔరా! ఎంతపోటరివి ?

తే. గీ. నీవొకండవెకాకను ♦ నీదుచెల్మి
కానితోడుగాఁ గొన్నోప్వ ♦ గాలుపురికి
నెంచినాడవు లోకోక్తి ♦ గాంచనిజము
రాచపీన్గొంటిగా జన ♦ దంచు తెపుట. 12

దుర్బు—(కత్తిఁ దీసుకొని పైకిలేచి)

తే. గీ. తలచినంతనె జగమెల్లఁ ♦ గలయద్రిప్పి
దహనమొనరింపఁ గలశక్తిఁ ♦ దగిలియున్న
ననలునకు ననిలుఁడు సహా ♦ య మగురీతి
నిర్వైరముచేర హరియైన ♦ నిల్వఁగలఁడె. 13

జానా—ఓరీ! మూఢా! నీచకులాధమా!

ఆ. వె. శౌర్యహీనుఁ డీఁను ♦ జాలమాటలు పెద్ద
యనెడు నార్యవాక్య ♦ మనృత మగునె
పత్తురేనిమీరు ♦ వహ్నిలో నుఁతికెడు
శలభచయము భంగిఁ ♦ జత్తురిపుడు. 14

(అని కోపముతో ఖడ్గమునుబూని నిలువఁబడుచున్నాఁడు.)

దుశ్శీ—(దుశ్శేష్ట దుర్బుద్ధులను బట్టుకొని) మిత్రులారా! ఏనిమిత్తకారణముగాఁ బోట్లాడెదరు? కార్యభంగము కలుగకుండా నెట్లైనా నాలోచించవలెను.

దుశ్శే—రాజా! అయథమని చెడుమాటలకు నాయెద యెట్లుసైచును.

దుర్బు—నృపశిఖామణీ! పైత్యజ్వరమంకురించిన వానివలె యొడలెఱుంగక నిర్భయముగాఁ దుర్భాషలాడుచున్నవాఁడు. ఒక్కసారి నాబాహుబల పరాక్రమము చవిఁ జూచుఁగాక పోనిమ్ము.

(అని విదలించుకొనఁ బోవుచున్నాఁడు.)

సారా—రాజా! రానిమ్ము. రానిమ్ము.

ఆ. వె. ఒడలు మఱువఁజేయు ♦ యున్మత్తజ్వరమది
మాధుమ్పిష్టఘట్ట ♦ మనెడుమాత్ర
తగిలినేని తెగులు ♦ త్వరలోనఁ దగ్గను
దడవు సేయ కింక ♦ విడువు మయ్య. 15

(అని మీఁదికిఁ బోవుచున్నాడు.)

మతి—(నారాయణసింగును బట్టుకొని) మతి భ్రమించినదా యేమి? ఊరకుండుము.

జనా—క. మత్తుడవున దూషితదు, శ్చిత్తుఁడ వీ వంతెగాక ♦ చెనటుఁడ ఫ్రౌరా
యిత్తఱిఁ బేర్చిన యమపురి కుత్తరు విచ్చెదను వేగఁ ♦ గొనినీశిరమున్

(అని పైఁబడఁ బోవుచున్నాఁడు.)

సత్య—(అతనిఁ బట్టుకొని) చెలికాడా! ఏలనీకలఁత మనము కలగజేసుకొనకుండు నెడ వారిచ్చవచ్చినట్లు పోట్లుపడియెదరు. కూర్చుండుము.

(అని అందఱిని గూర్చుండ బెట్టుచున్నాఁడు.)

దుశ్శీ—ఓయీ! కలహమునువిడచి ముందుసంగతి నాలోచింపుఁడు.

మతి—ముందుసంగతి కేమి? సంగర మొనరించుటకు మాకింతమాత్రము నిచ్ఛలేదు.

దుశ్శీ—అటుగాకున్న మనము చేయవలసిన పనియేమి?



సత్య—మానవేశా!

ఉ. పట్టినపట్టు వీక ♦ బాలునిపైఁ గదియంగ నెంచితీ
పట్టునమీదు పంతమిక ♦ వట్టిదిచెల్లుట నాదువాక్యముల్
గట్టిగనమ్మి యోనృపశి ♦ ఖామణి పిత్రుని రాజ్యదంపతుల్
పట్టికొసంగి యమ్మహుని ♦ పట్టునఁజేరి సుఖింపు నిచ్చలున్ 17

యిందులకు సమ్మతింపకున్నఁ గయ్యంబునకు నియ్యకొనము.

దుశ్శీ—చాలుచాలు. తే. గీ. కసవు మేసెడి పసరంబు ♦ కరణి పరుల
చెంతఁజేరి పౌరుషమును ♦ జెరచి సైచి
మనుటయే మంచిదన బను ♦ పుసకు మనకు
ధరను నెంచంగ పాదభే ♦ దంబుకాదె.

అదికాక, రణంబున ప్రాణంబులు వీడుటొండె లేక గెల్చుటొండె. ఎట్లయిన నుమంచిదే. పురుషునకు పౌరుషమూ లేక ప్రాణమూ ముఖ్యము? ఏలయిట్లు పలుగాకిమాటలాడెదవు.

దుశ్శే—నృపాలా! ఏల గాలయాపనచేసెదవు. వారిని బ్రతిమాల నవసరములేదు.

క. దుర్భరులను పగవాఁడల, గర్భంబులుచీరిసైచి ♦ క్షతజనుపానల్
నిర్భయముగఁ జేసితి మీ, యర్భకుఁడన నెంత మాకు ఁ నాజినెదుర్పన్

జనా—ఓరిచపలచిత్తా! మాప్రాణంబులు రణంబున వీడువరకు నాపాపని కించుకయైన నపాయము కలుగఁ జేయుము. నీకున్న కక్కసముకొరెద చక్కసంబుగా నుక్కివముతోఁ బల్కుచుంటివి కాని నీవిక్కణగించుటకు మాలోనొక్కఁడుచాలు.

దుశ్శే—ఔరా నీవాడుమాటలు నాహృదయంబునకుఁ గఱకుటమ్ముల వలెఁ దగిలి కల్లఁజేయుచున్నవి.

క. క్షితిలోక్షితిపతియానలు, మితిదప్పగ రాదటంచు ♦ మిన్నకయుంటిన్
కతిపయక్షణముల కిందనె, పిత్రుపతి పట్టంబునీకు ♦ వేశ్మము గాదే.

నారా—ఔనౌను. రాజాజ్ఞ చేతనో నీకున్న పిఱికితనము చేతనో యూరకుంటివి. లేకున్న నివేకాక నీమిత్రులతోఁగూడ యమసదనంబున కిదివరకే యరిగియుందువు. చాలుచాలుయిక నైన నీతుచ్ఛసంభాషణఁ కట్టిపెట్టి యూరకొమ్ము.

దుర్బు—నారాయణ!

ఆ. వె. పరుగులెత్తువాని ఁ పడఁగొంటుగాఁ నెంచి
వెంట నంటి తరుము ♦ తుంటరివలె

యూరకొన్నకొలఁది ♦ నోరెత్తి మమ్ముల
నిష్ఠురంబు లాడ ♦ నేర్చితకట.

మేమేనా యంత నోరుమూలినవారము. నీకన్న నెక్కుడుగాఁ బ్రాగల్భ్యములను జెప్పగలము. ఇకచాలించి మిన్నకుండుఁడు.

నారా—ప్రాగల్భ్యములందు మాకన్న నెక్కువయేకాని. (అధోక్తి)

దుర్బు—ఆహా! భుజాబలంబునకు దక్కువయనా, యెంచుమంటివి?

నారా—ఏదీ చూతము. ఒకసారిరమ్ము.

దుర్బు—ఓరీ నీకృత్యంబులంజూడఁగ

తే. గీ. ప్రేమతోఁ బాలునన్నంబుఁ ♦ బెట్టిపెంచఁ
గడకుఁ గాళ్ళుపీకిన శున ♦ కంబుకరణి
మానృపుని చేతఁ బెరుఁగుచు ♦ మమ్ముగదియఁ
దలఁచి తించుక సిగ్గవే ♦ తలఁపులేక. 22

నారా—ఏలాగునైనను శునకమువిశ్వాసమగు జాతిలోనిదే. నీవన్ననో

తే. గీ. విషధరమునకు పాలిడ ♦ విషమునిచ్చు
భంగిమాప్రభాకరు నృపు ♦ పట్టణమునఁ
జేరి యాతని సిరిచేత ♦ జీవనంబుఁ
జేయుచుండి మాకీఁక హానిఁ ♦ జేయఁజూతు. 23

దుశ్చే—ఆహా! మీప్రభాకరుండు స్వర్గారోహణుం డయినాడు.

నారా—ఇకకొంత సేపటికిమీ (అధోక్తి.)

జనా—మిత్రమా! యిదియేటిసంభాషణ.

తే. గీ. అల్పజనులకు సంపద ♦ లబ్బె నేని
రహిని యర్ధరాత్రిలను ఛ ♦ త్రింబుఁ బట్టు
మని భటులకాజ్ఞనిడినట్టు ♦ మంచిచెడ్డ
లు దెలియునె మూఢమతులగు ♦ లుచ్చెలకును. 24

వారెన్ని ప్రేలినను మనకు లక్ష్యమే. కాఁదలఁచిన కార్యము గంధర్వులేతీర్చిరని నట్టుగా మనమూరకొన్న వారిపాట్లు వారే పడెదరు.

దుర్బు—ఔనౌను. మీరు కలహమునఁ గలుగఁజేసి కొనకుండునెడ రాజ్యము పోవు నని పల్కుచుంటిరి. యీపల్కుఁ గాంచగా

తే. గీ. తల్లకిందుల నిల్చి చ ♦ దటు మదీయ
పాదముల్పమునను గాడ ♦ పడకనాగె



యనెడు తీతుపక్షితదీయ కి ఘనభుజా బ
లంబుచే రాజ్యమాగిన ♦ ట్లాడుచుంటి. 25

(అంతట తెఱలో) దుశ్శీలనృపాలా! మనరత్నగిరిపురము వింగల్గా ప్రభువును ప్రభాకరు నకు కారాబు కొమరుండగు జయచంద్రుఁడు ముట్టడించియున్నవాఁడు వే గస్తమరసన్నాహముతో రండు రండు.

దుశ్శీ—అమాత్యులారా! సేనాపతులారా! ప్రభాకరుని జంపినప్పటికి మిమ్ములను మీ వృత్తులనుండి తొలఁగింపక మీయిష్టానుసారముగాఁ బ్రవర్తించినాడను గదా. ఇదివరకెన్ని మాట లనుకొన్నను గార్యమువచ్చినప్పుడు మనమందఱమొక్కటిగా నుండవలెను. “ ఆడఁబోయిన తీర్థమెదురయినట్లు ” యిచ్చటకే జయచంద్రుఁడు వచ్చి యున్నవాఁడు. ఎంతబలాఢ్యునికైనఁ దనతావు విడచి శత్రుస్థానమునకు వచ్చి పోరాడి గెలుచుట దుర్ఘటంబుగదా. కావున మీసైన్యముల్ఁగూర్చుకొనిరండు.

మతి—మనుజాధిపా!

ఉ. మేలొనగూర్పగాఁదలఁచి ♦ మిక్కిలి ప్రాలిని మీదుచెంత నే
వేళల నిల్లుగట్టుకొని ♦ వేడిన వీనులఁ బెట్టకుండనా
బాలునిమీఁదికింజన ను ♦ పాయము నెంచెఁగ చెప్పునట్టిమా
లాలనపల్కులన్నియు వి ♦ లాసిని కిచ్చిన సొమ్ములయ్యెఁగా. 26

సత్య—రాజా! నీకు నాయెడ లాగ్రహము సంభవించినను సరేకాని.

తే. గీ. నాఁడుదశకంఠ దుర్యోధ ♦ నాధులట్లు
నీకు మృత్యువుసమకూరె ♦ లేకయున్న
మాదుపల్కులాలింపవే ♦ మందునకట
గణకకునుకథలనుఁ జెప్ప ♦ వినినియటుల. 27

[అంతట తెఱలో]

భూవరా! త్వరగాఁ గదనప్రియత్నమై రమ్ము. జయచంద్రుఁడు పురము మీఁదికి వచ్చుచున్నవాఁడు. జాగుచేసిన హాని రాఁగలదు.

దుశ్శీ—(కోపముతో) ఔరా! యెన్నిసారులు సమరసన్నాహములు గమ్మన్నను నా మాటలు విశ్వసించకుండిరి. ఆనాఁడు మీరాజుతోఁగూడ మిమ్ములను దెగటార్చిన నింతపని జరుగకుండును. అయిన నిప్పుడు మించినదేమి?

మ. విలసత్సంపదకాటపట్టయినయా ♦ వింగ్లదేశాధిపు
ద్గలహంబందునఁ బిల్కుమార్చివెసనా ♦ ఖడ్గాన మీకుత్తుకల్
తోలఁగంజేయకయున్నచో నటుపయి ♦ న్దుశ్శీలుడంచు న్ననుక్
బిలువంబోకుడి నాదుశబ్ద మికయే ♦ వే ల్పడ్డినం దప్పనే. 28

(అనిలేచి) రండుమిత్రులారా! (అని నిష్క్రమించుచున్నాఁడు)

దుర్బు—మంచిది (అనిలేచి)

తే. గీ. తిన్నయింటికిఁ జేటును ♦ దెచ్చుటయును
నేటిని గడచి తెప్పకు ♦ నిప్పిడుటయుఁ
దల్లిని జరిహసింపంగఁ ♦ దలఁచుటయును
బోలె మీకృత్యములనెన్న ♦ కూళలారా. 29

జనా—ఓరీ! తల్లిపుట్టినిల్లు మేనమామకు నెఱుక గాకుండునా? యటులనే చిన్ననాటనుండి మీదుర్నడతలు మాకు తెలియనట్లే యిప్పుడు వచించుచుంటివి. చాలునిక నీనుడులు. నడునడు.

దుర్బు—చాలు లే పరితాపము. (అని నిష్క్రమించు చున్నాఁడు)

దుశ్శే—(సభ్యులదెసఁజూచి) మీరలు మీరాజుగారి ప్రతిభవింటిరి గద తరువాతనాయనపాదముల పయింబడినను లాభములేదు.

నారా—ఓరీ! నీవలెనే యనుకుంటివి కాఁబోలు.

ఉ. సందియ మేల నాప్రతిభ ♦ సభ్యులముంగలఁ బల్కుచుంటినా
బొందినిపీడి ప్రాణములు ♦ పూర్తిగనిబోయెడు నంతదాక యా
నందనుఁ డింతయే భయము ♦ నాపదఁ బొందఁగఁ జేయనీవొకో
యందినఝుట్టుపట్టికొను ♦ దండకయుండిన కాళ్ళుపట్టెదా 20

దుశ్శే—చాలు నీపరితాపము నీవే మెచ్చుకొనవలె ‹‹ తనకు తాను మెచ్చుకు టెంత (———)

జనా—దుశ్శేష్టా! నీకోసమయి భటులు వచ్చియున్నారు. వేగఁబొమ్ము.

దుశ్శే—(యిటునటుఁ జూచి) ఏరీ! భటులు.

జనా—యమభటులు.



దుశ్శే—చాలు నీపెడయుక్తికి సంతసించితి.
(అని తొందరగా నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య—అగ్రజా! మన మాతురతతోఁ బోయి యా జయచంద్రునిం గలిసికొని కదనమునకుఁ దగిన సదుపాయముఁ జేయుదము.

మతి—మంచిది. (అని నారాయణ జనార్ధన సింగులవైపుఁ జూచి) మిత్రులారా! రండు బోదము (అని నిష్క్రమించుచున్నారు.

తే. గీ. ధరణిహూణాంధ్ర భాషల ♦ సరసతెలిగి
కవితచాతుర్య సంగీత ♦ జవినెఱుంగు
యలఘు సుకవి సుందరరామ ♦ యాఖ్యచేత
వ్రాయఁబడె నిది భూమిపై ♦ వరలుగాత.





# లాల్ గోహారు

అను

# జయచంద్ర చంద్రరేఖా విజయము.

## దశమాంకము

ప్రదేశము—రత్నగిరి, డేరాలసీను, యుద్ధభూమి.

(జయచంద్రుఁడు, మతిమంత, సత్యసేన, శ్రుతశర్మ, యనుమంత్రులతోడను, గొంత సైన్యముతోడను, ప్రవేశించుచున్నాఁడు.)

జయ—(మతిమంత సత్యసేనలనుఁ జూచి) సచివాగ్రగణ్యులార! తరువాత నేమి జరిగినది.

మతి—రాజా! యేమున్నది?

ఉ. ఏటికి మంచిచెడ్డల నొ ♦ కించుక యెంచనివానితోడ మీ
కేటికి రాయబార మిఁక ♦ నేటికిఁ జెప్పితి నీతులెన్నొ ము
మ్మాటికి నాదుపంత మిఁక ♦ మానుట లేదని తానుబట్టు కుం
దేటికి మూడెకాళ్ళనుచుఁ ♦ దీటుగఁ బట్టినపట్టు వీఁడఁడో, 1

సత్య—నృపవతంస! యాతనికి సంగ్రామమందె ముఖ్యాభిప్రాయమై యున్నది.

శ్రుత—భళా! యేల యీలీల జేలతనంబు? ఆతఁడు మిమ్ములఁ బెట్టిన యిక్కట్టులను దలంచుకొన్న నెంత కఠినహృదయుని కైనను కనికరము పుట్టకమానదు గదా! ఆక్రూరుఁడు రణంబున మరణం బొందవలసినదే. లేకున్నయుం దనేక కష్టములఁ బ్రాప్తింపను

జయ—మంత్రిపుంగవా! యాసంగతి యటుండనిండు. రాజ్యాధిపత్యమును వహించువాఁడు.



సీ. ధైర్యసాహసగుణ ♦ శౌర్యానురక్తుఁడై, మానవతతి నెందు ♦ మనుపవలయు
సకలధర్మాధర్మ ♦ శాస్త్రపద్ధతి నెంచి, యింపుగాఁ బ్రజలఁ ♦ బాలింపవలయు
ఆగ్రహానుగ్రహ ♦ నిగ్రహశక్తుఁడై, తగినవేళలయందుఁ ♦ దాల్పవలయు
యుక్తం బయుక్తంబు ♦ నోలి గ్రహించుచు, మంచిచెడ్డల నాల ♦ కించవలయు
తే. గీ. నయనమున నొక్కసారి రా ♦ జవనిజనుల, క్షేమమలయఁగవలయును ♦ బ్రేమతోడ
ననుచుదెలిపెడు మీబోటి ♦ ఘనుల నుడులు, నాలకించుచు మీరుంట ♦ యఘము గాదె.

శ్రుత—సెబాస్ వత్సా! రూపమునకుఁ జిన్నవాఁడ వైనను బుద్ధికిం బెద్దవాఁడవే.

జయ—కావున మనమీధర్మములు మర్మములు నెఱిఁగియుండి తప్పొనరింప మనసున కెట్లొప్పిదమగును.

మతి—జనవరా! మీత ప్పేమియున్నది. సాంపరాయమునకు ముందుగా రాయబారమునకుఁగా జాబంపితిమిగదా.

[తెరలో]

ఓరీ! దుశ్చేష్ట! ఓరీ! దుర్బుద్ధి! గుదెతాల్పుపురమునఁ బదిలముగ నుంటిరిగద. (అనుచు రక్తధారాసిక్త దేహులై జనార్దనసింగు నారాయణసింగులు ప్రవేశించుచున్నారు)

జనా— }
నారా— } జయచంద్రమహారాజా! సచివేంద్రులారా! నమస్కారములు.

జయ—(నివ్వెఱపాటుతోఁ జూచుచున్నాఁడు)

సత్య—ఓరాజపుత్రా! వారలు మనసేనానాయకులగు, జనార్ధననారాయణసింగులు

మతి—శౌర్యమును తగ్గించి జరిగినపనిఁ దెల్పుఁడు.

నారా—సచివాగ్రణీ! సమరభూమికి నరుగుచుండ దుర్బుద్ధి దుశ్చేష్టులు దారి కడ్డగ వచ్చి.

ఉ. ఓరి దురాత్ములార వినుఁ ♦ డుక్కడఁగించెద మెందుడాగినం
బోరక నీడ నొప్పదుమె ♦ పోతరమెక్కి సభాస్థలి న్నృపున్
బీరపు మాటలాడ నొక ♦ పెట్టున మిమ్ము ప్రభాకరాఖ్యుతో
వారకచేర్పమే పతి ని ♦ వారణ సేయగ నూరకుంటిమా. 3

అని దుర్బుద్ధిపయిం బడఁ గినిసి.

శా. తన్నం దాపున కోర్వలేక మదిలోఁ ♦ దాధైర్యము న్వాసియా
పన్నుండై భువి వ్రాలి క్రిమ్మర నను ♦ న్బట్టంగఁ దా లేచినం
దన్నం ధాత్రిని ద్రోసి పాదమున నుక్కం ♦ ద్రొక్కఁ బ్రాణార్థులకా
ఖిన్నుండై పురవిచ్చె మంత్రితనయా ♦ ఖేదంబుతో నచ్చటన్ 4

నార — దుర్బుద్ధియాతనిం బట్టఁగనే దుశ్చేష్టుఁడు నామీఁదికి వచ్చి

శా. పట్టన్ బట్టఁగఁ జుట్టుఁ బట్టుకొని నేఁ ♦ బాదంబుచేఁ ద్రొక్కఁ గా
గుట్టల్ వీడగ ముష్టిఘాతమున ది ♦ క్కుల్ మ్రోవ మోదంగని
ట్టట్టై మిఁ గదలింపలేక ననువుల్ ♦ దాపిడియుండ న్దగన్
బొట్టన్ గుద్దిక్కఁ లిఁ గాళ్ళు చేతులను స ♦ త్పూజ్యుల్ ననుం మెచ్చగన్

సత్య — (సంతోషముతో) ఆహా! మనజయచంద్రునకుఁ గొంతబరువు తగ్గించినారము గదా! అదియునుం గాక.

ఉ. ఏరిని నమ్మి నాఁడొ తన ♦ కెవ్వరు యాప్తులో రాజ్యలక్ష్మియే
వారల చేతఁ గల్గునని ♦ వాంఛిత బుద్ధిని నున్నవాఁడో య
వ్వారలె ముందు గాఁగినియ ♦ వర్జిత బాహుద్వయుండునయ్యె యా
క్రూరుఁ డికేమి సేయనగు ♦ కోరలుదీసిన త్రాచు గాఁడొకో 6

మతి — ఇఁక దుష్శీలుఁడా! యాతనిమాత్రము మడియింపలేమా?

జయ — అమ్మలారా! మీదయ కలిగిన నదియొక ఘనకార్యమా!

జనా — రాజా! మే మెఱుఁగకుండ నానడిరేయి మీ జనకునిఁ బరిమార్చి మిమ్ములను గాననంబునం గడదేర్పఁబనిచినాడు. ఆ దురాలోచన

భద్రిక. గుట్టై తెంగిలి మేని తా, నెట్టిచోటున డాగినన్
బట్టి యాతని నప్పుడే, మట్టు పెట్టకయుండమే. 7

జయ — ఇప్పుడుమాత్రము మించినదేమి?

నార — మానవేంద్రా! గోరునఁ దుంచి వైచునది గొడ్డలితో నఱుక వలసెనుగదా!

శ్రుత — మీరందఱు నానృపాలుని యందిట్టి ప్రేమాతిశయంబులు గలవారైయుండినం దులకు నాకెంతయు సంతసముగా నున్నది.

సత్య — ఆ పరిభాకరభూపతులాగ్రగణ్యుని ధనముచే జీవనము చేయుచుండి యింతటి స హాయముఁ జేయలేమా?

జయ — మీయట్టివారల కిట్టి సరసత్వ మున్నది. కాని లోకములో నందఱికినుండునా?

మతి — పృథ్వీశా! మీతండ్రిగారికి మాపయిం గల ప్రీతి నెంచవలెనన్న

చ. తనదగు రాజ్యలక్ష్మిపిరియ ♦ దారసుతాసుత మిత్రులాది పైఁ
దనరెడు ప్రేమసొక్కఁటిగ ♦ త్రాసునఁబెట్టి మరొక్కపక్కనం
దునిచియు మాపయి న్నెనరు ♦ తూచిన చూపుడుముల్లు పేర్మితో
మనుజవరేణ్య వంగుఁగద ♦ మాయెడలం గల ప్రీతి యందుకున్. 8



కావున నమ్మహానుభావుని సుపుత్రుండవయ్యుండి జనకునిం బోలిన సుగుణంబులు కలిగియుండెదు గాక మాపయింగూర్మిం గలిగియుండ మిము విడుచుటెట్లు.

జయ — ఇదివఱలో మాజనకుని యెడల మీకిట్టి యనురాగముండునో నాయందును న ట్టులే యుండవలెను.

(తెరలో) — మహాత్ములారా! మీరందఱుంగలిసి యనుగ్రహంబునఁ గాపురంబుందురుగాని.

[అని దుష్శీలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

జనా — రాజా! యానృపుని సంగతి కేమి గాని తప్పక నీమిత్రద్వయం బుండు నెలవున కు నీవును నేఁగఁగలవు.

దుశ్శీ — ఓరీ! బాలకా! ఆనాఁడు కాననమున మడియుట తప్పినఁదని యుప్పొంగి సమ రమునకు వచ్చితివి.

చ. ఘనముగ నీవు నన్ని పుడు ♦ కయ్యమునం దెదిరించ నెంచుటల్
కనఁగ సమస్తభాగ్యములు ♦ గల్గినవాని నికేతనంబునన్
మనుచుమనుండ మైబలసి ♦ మత్తతచే విపినంబులోనికిం
జని యటనున్న సింగమును ♦ జంపఁదలంచు కురంగచందమో. 9

అదియునుం గాక.

క. కలహముఁ జేయఁగ నాతో తలపఁగ మూఢత్వమెన్న ♦ దౌర్జన్యమునం
బులిమీసలఁ జేకొనియు, య్యెలయూఁగఁగ నెంచుటకుఁ బ్రి ♦ యత్నించుటె గా.

జయ — ఓరీమూఢా! రాజద్రోహి! కులఘాతకా!

పంచ. దురంబున న్నరంబునీదు ♦ దోర్బలాన గెల్చిపోఁ
దఁలంబుగాక యుండి నేడ ♦ ధర్మవృత్తి నిద్రలో
శిరంబుఁగోయ మానుషంబు ♦ చెల్లెనా దురాత్మనిన్
బిరానఁ జంపివేయకున్నఁ ♦ జేతు లేలఁ గాల్పనే. 11

ఛీ యిక నాయెదుట యుండఁదగవు.

తే. గీ. కాలయాపన మొనరింప ♦ గాదు ద్రోహి
యెందుకొచ్చినమాటలు ♦ యెవరు వార్తు
రసలు క్షత్రియ వంశుఁడ ♦ [illegible]
రైదుఁ పడిఁజేసిపోవక ♦ నాజనిల్వ. 12

దుశ్శీ — ఓరీ! [illegible]గా!

తే. గీ. నాదు [illegible]బాణాగ్నిచే ♦ నీదుమేను
[illegible] ♦ [illegible]

యైదు పదిజేతునో పది ♦ నైదుజేతో
తెలిసి గొనెదవు నిమిసంబు ♦ నిలువు మిచట. 18

(అని మీఁది కఱుగుచున్నాఁడు) వనమంజిరి.

జయ— (లేచి) వినుమిక యంజలి వెన్కకు వేయను ♦ వ్రేటునం దెగవేసెదన్
దుశ్శీ— పనివడి నీవిట గర్వపుఁ బల్కులు ♦ పల్కఁగా భయమే మొకో
జయ— ఘనమగు నాభుజబాహుల ♦ కడ్డువచ్చిన నిప్పుడే
దుశ్శీ— మనుఁగుట నిక్కమనుమ్ వన ♦ మాలి శూలియె కానిఁకన్. 14

(అని తక్షణమే మీఁదికఱుగుచున్నాఁడు)

నారా—(ఇద్దరు మధ్య కడ్డువచ్చి)

తే. గీ. నీదు చెల్మికాండ్రు ♦ నీవలె నేను కదా
గొప్ప జెప్పి ముందె ♦ క్రుంగినారు
నీవనంగ నెంత ♦ నిన్ను చిదుము టెంత
కొండ చివరనుండు ♦ బండటాయి. 15

(తెఱవెన్క)—ఓరి కులద్రోహి! పరవనితాపహార! విత్తచోరా! మదోన్మత్తా! నిలు. నిలు. ఇంక యెటకు పోయెదవె.

(అని సుశీలుఁడు చంద్రరేఖతో ప్రవేశించుచున్నాఁడు)

సుశీ— అంబురుహ వృత్తము.

ఓరి దురాత్మ! పరాక్రమహీన స ♦ హోదరాంతక తస్కరా
బీరపుపల్కులు పలఁగ నేటికి ♦ వీరుడంచును వానితో
శూరత నాపయిఁ జూపఁ యెచ్చట ♦ జొచ్చినం బోరిపుచ్చెదన్
రార ప్రజావళి మెచ్చఁగఁ బంపెద ♦ శార్ఙ్గదేవుని పట్టుకున్.

(అని జుట్టుపట్టుకుని యీడ్చుకొనిఁ బోవుచున్నాఁడు)

జనా—(జయచంద్రునితో) రాజా! యీసుశీలవిరాట్టున కేవిధమయిన హాని రాకుండఁ గాపాడఁ దలంచినారము కావునఁ బోవుటకు మాకిర్వురకును సెల వొసంగుఁడు.

జయ—మంచిది.

(జనార్దన నారాయణ సింగులు నిష్క్రమించుచున్నారు.)

జయ—(చెల్లెలను కౌఁగలించుకొని ముద్దుపెట్టుకొని) అమ్మా! వచ్చితివా! వచ్చితివా! నిన్నాక్రూర మృగాళికుక్షి కిడితినని విచారించితిని. నిన్ను విడచితే నేగినందులకు నన్ను క్షమింపుము.



చంద్రి—అన్న! నన్నా విపినంబున విడచి పోవుట మంచిదా!

జయ—అమ్మా! నీవా వనమధ్యంబున మూర్ఛవోవ పసవి పసవి జలములకై యేగుచో

తే. గీ. దారిఁ దప్పి డొంకలలోన ♦ దూరిదూరి
యెట్టకేలకు వింగుర్లన్ ♦ పట్టణమున
జేరి యచ్చట ప్రజలచేఁ గారవమున
రాజ్యపట్టంబు పూనితి ♦ పూజ్యుఁడగుచు. 18

అతరుణమున నే నిను నెమకుటకయి యనేక వేగులవాండ్ర ననేక యరణ్యంబులకుం బనిచితి. నిన్ను విడనాడుట నాకుఁ బగయా?

చంద్రి—అన్నా! నీవు చనిన కొంతసేపటికి మూర్ఛఁదెలిసి యనేక విధంబుల శోకించుచుండ నొక బోయచేతఁ జిక్కి మామగారిచేఁ బ్రాణంబులం దక్కించుకొని నిన్నరయుటకై యనేకవనంబులఁ పల్లెలు వెదకుచుండఁ దుదకు నీబంటువలన నేమం బెఱిగిన వారమయి కడుమోద మొంది వింగుర్లకుఁ బోవఁగా నచట వారిచే నమ్మగారు బెస్తవాండ్రచేఁ జిక్కినది మొదలు నీవు సమరసన్నాహుఁడవై యిక్కడకు వచ్చినవఱకు జరిగిన యావద్వృత్తాంతము విని యతి తొందరతో నిచ్చటకు వచ్చినారము. అమ్మగారెచ్చట యున్నవారు.

జయ—(బంటునిఁజూచి) ఓరీ! మాజనని డేరాలోనున్నది. పిల్వుము.

బంటు—చిత్తము. (అని పోయి యామెతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

సుశీ—(చంద్రరేఖను కౌగలించుకొని) అమ్మా! యెట్లు జీవించితివి?

చంద్రి—నీవెటులో నేను నటులో.

సుశీ—ఆహా! దైవమాయ.

తే. గీ. నవ్వరోదన పాలయుల్క ♦ క్రొవ్వుతలకుఁ
నాదిగాగల కృత్యముల్ ♦ నరయ నొక్క
త్రుటినె నెల్లఁ జీవులను పొం ♦ దించు నహహ
శౌరిమాయ లెన్నవశమె ♦ స్థాణుకైన. 19

జయ—(సంతోషముతో) ఆహా! మన మువ్వురముఁ జేరి ముచ్చటలాడుకొందుమని మున్నెన్నఁడైనను తలంచితిమా? అన్న! అన్న! యన్నగతుల్పని మాయెల్లన్న చిత్రంబులుగదా.

చంద్రి—అదిగో! మామగారు సంతోషస్వాంతులై వచ్చుచున్నారు. దుశ్శీలునిం దునిమి మాయన్నకు రాజ్యమిడుదునన్న ప్రతిని నెరవేర్చినట్లు గన్పట్టుచున్నయది.

జయ—చ. ఎఱుఁగవొ యేణలోచన మృగేంద్రము వ్యాఘ్రము లాదిగా భయం
కరమగు దుష్టజంతువులఁ ♦ గన్గొనినంతనె మీఁది కేగి ని
ర్భరముగ జీల్చి చంపఁగల ♦ బాహుపరాక్రమశాలికిట్టి వా
డరయఁగ లెక్కయే చెలియ ♦ కక్కట పల్కెద వద్భుతంబుగా.

(అంత సుశీలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుశీల—అన్నా! నమస్కారము.

జయ—మామగారు! వందనము.

చంద్ర—మాతాగ్రజా! తమ వార్ధక్యము వెరవేర్చితిరిగదా!

సుశీ—అమ్మా! దైవ మనుకూలుఁడైనచో యది యెంతపని. అదిగాక

క. ఋణశేషము రణశేషము, వ్రణశేషము శత్రుశేష ♦ పావకశేషం
బనువాటిలో చతుర్థము, క్షుణమువ సేయక దగదని ♦ జనము లనరొకో

కావున నట్టిబాధ లేకుండ తొలఁగించితిని.

జయచంద్రా! నీ కేమి కావలయునో దేవుని ప్రార్థింపుము.

జయ— మంగళ మహాశ్రీవృత్తము.

తారక విధాంత శత ♦ వత్సరములాయువిడి ♦ బాగుగను విద్యలిడి కావన్
శౌరి ఘనసంపదలు ♦ శాంతము సుదారతను ♦ సఖ్యము నొసంగి దయబ్రోవన్
గౌరిపతి న్యాయమును ♦ గాచి మదకుచ్ఛర వి ♦ కార చెడుబుద్ధులను ద్రోచన్
కూరిమిని వందనము ♦ కోర్కెలలరంగనివిగో ♦ గొనుము మంగళమహాశ్రీ.

(అని ఆకసమువంకఁ జూచి త్రిమూర్తులకు నమస్కరించుచున్నాఁడు.)

త్రిమూ—తథాస్తు. తథాస్తు. (అనుచున్నారు.)

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల చరణారుణారవింద మరంద తుందిలేందిం
దిరాయమాన మానసోదా రైనాపురాన్వయ క్షీరనీరాకరరాకాసు
ధాకర బాపనార్య పౌత్ర సోమరాట్పుత్ర భారద్వాజస
గోత్ర పవిత్ర కాత్యాయనీమాత్ర విచిత్ర సుందరాం
బాగర్భశుక్తి ముక్తాఫల విబుధజనవిధేయ
సుందరరామయ నామధేయ ప్రణీ
[illegible]న నాటక రాజంబున
[illegible]శమాంకము
[illegible]సంపూర్ణము.



